# మోపూరు కాలభైరవుడు



రచయిత :

## విద్వాన్ రాయరె

తెలుగు పండితులు




**అంకితము :**

||తే|| ప్రళయకాల మహాకాలభైరవుండు
సర్వలోక వినాశము సలుపునపుడు
నాదు పొత్తము నాశము పొందకుండ
అంకితము జేతు శ్రీ భైరవాంకమునకు

విద్వాన్ రాయరె.

ప్రథమ ముద్రణము 2002
చిత్రభాను విజయదశిమి
ప్రతులు 1000

ప్రచురణ కర్తలు

జొన్నా ఈశ్వరయ్య వరలక్ష్మి దంపతులవారిబిడ్డ
అకాలమరణము పొందిన
సుబ్బలక్ష్మి (బుజ్జి) జ్ఞాపకార్థము

మూల్యము రూ. 10

ముద్రణ : **మమత ఆఫ్‌సెట్ ప్రింటర్**
శ్రీ వెంకటేశ్వర దేవస్థానం ఎదురుగా, పులివెందుల.
ఫోన్ : 227501

2832/ROP







**జననము**
**9-1-1981**

**మరణము**
**30-9-2001**

## జొన్నా సుబ్బలక్ష్మి (బుజ్జి)

||కం|| మా పాపను మా బుజ్జిని
ఏపాపముజేయకున్న నెందులకిటులన్
రూపంబు మాపె విధియని
ఈ పాత్రములోన రూపమిటు పితనిలిపెన్



ప్రచురణకర్తలు

జొన్నా ఈశ్వరయ్య, వరలక్ష్మి దంపతులు

# కవి వంశము

॥సీ॥ దొడ్డ వంశంబైన రెడ్డికులంబున
రామిరెడ్డి యింటి నామమున్న
గంగిరెడ్డి మరియు గంగమ్మలకు పుట్టె
నారాయణుండను నామమొంది
ఆ ఘనునకు సూరమాంబకు జన్మించె
కొండరెడ్డియనగ దండిమగడు
అతని పత్ని సిద్ధమాంబకు కలిగెను
చిన్నవీరారెడ్డి చిన్నకొడుకు
చిన్నవీరారెడ్డి చిన్నగంగమ్మల
కుదయించె "రాయరె" ముదముగలుగ
సంస్కృతాంధ్రాంగ హిందీ విశారదుండు
కర్షకుడు, కవి, పండిత, గాయకుండు
రామిరెడ్డి యల్లారెడ్డి నామమైన
రాయరేయను పేరుతో రచనచేసె.

రామిరెడ్డివారి వంశమున గంగిరెడ్డి గంగమ్మలకు నారాయణరెడ్డి జన్మించెను. నారాయణరెడ్డి సూరమ్మలకు కొండారెడ్డి జనించెను. కొండారెడ్డి సిద్ధమ్మలకు పెద్దవీరారెడ్డి, చిన్నవీరారెడ్డి జన్మించిరి. చిన్నవీరారెడ్డి చిన్నగంగమ్మలకు యల్లారెడ్డి జన్మించెను. ఈ రామిరెడ్డి యల్లారెడ్డియే గ్రంధకర్త. ఈయన రచించిన ఇతర గ్రంధములు

1) యల్లారెడ్డి గాయాలు (హృదయ వేదన)

2). యల్లారెడ్డి సూక్తిముక్తావళి (సూక్తి చతుశ్శతి).

3). అభినవాంధ్ర బిల్హణీయము 4) ఆధునికాంధ్ర మేఘదూతము

5) మోపూరు కాలభైరవుడు 6)ఎల్లారెడ్డి రూపకములు

7)ఎల్లారెడ్డి గేయాలు నాటకములు బుఱ్ఱకథలు పద్యఖండికలుకలవు

సాధారణముగా పూర్వకవులను రాజులు, మంత్రులు, దండనాథులు, జమీందారులు పోషించుచువారిచే ప్రబంధములు వ్రాయించి అంకితం కావించుకొనుచుండిరి. అట్లు అంకితము గైకొన్నవారు నేటికిని ఆ పుస్తకములందు శాశ్వితముగ ఉన్నారు. వారిరాజ్యాలు, అధికారాలు, ఐశ్వర్యము పుత్రపౌత్రాదులెవ్వరు లేకున్నను వారివంశాదుల వివరణ మీ పుస్తకములందు కలదు. రాతికట్టడములు నశించినను వ్రాత కట్టడములు అట్లే ఉండును.

ప్రస్తుతము కవులకు విలువలేదు. వారు వ్రాసుకొన్న పుస్తకములను వారేముద్రించు కొనవలెను. వారే అమ్ముకొన వలెను. అమ్ముకొని బ్రతకజూచినవారిని చులకనగాచూచెదరు. అట్టిస్థితి నాకుకలుగలేదు. నేను వ్రాసిన గ్రంథమును నేనే ముద్రించుకొంటిని. వాటినికూడ ఎవరిని బ్రతిమాలి అమ్ముకొనలేదు. తెలిసినవారికి కొన్నిటిని ఉచితముగా నొసంగితిని. ప్రచారముకూడ చేసుకొనలేదు. నేను నేర్చినవిద్యను నీతినితెలుపు పుస్తకములుకొన్ని ఇంకనుముద్రించలేదు నాతృప్తికొఱకు వ్రాసుకొన్నాను. ఇట్టిస్థితిఇకఎవ్వరికికలుగకుండుగాక. నేను కవినని కనీసము మా ఊరివారికిగాని మాప్రాంతీయులకుగాని తెలియదు అట్టిఅజ్ఞాతవాసమేనాకు ఇష్టము"యల్లారెడ్డిగాయములలో కవి"అను విషయమునందు అట్లు ఆవేదన ఆర్భాటము ఉండరాదని కూడ వ్రాసితిని. ఆత్మస్తుతి పరనింద పనికిరావు.

# ఆముఖము

"మోపూరు" అను ఊరులేదు. కాని మోపూరు కాలభైరవుడు కదలకున్నాడు. ప్రపంచమంతా ప్రళయమొందినను ఈ దేవుడు స్థిరముగా నుండును. ఎందుకనగా, ఈయన స్వయంభూవిగ్రహుడు. హరిహరాత్మజుడు, భైరవమూర్తి ప్రపంచము ప్రళయము చెంది సర్వము జలమయమైనప్పుడు, పవిత్ర స్థలములు పుణ్యక్షేత్రములు నశించక అట్లే ఉండును. అట్టి పవిత్ర స్థలమున వెలసిన ప్రళయ కాలభైరవుడు. ఈ దేవున్ని కొలుచు భక్తులకు భయముండదు. కోరికలు సిద్ధించును. ఈ దేవున్ని గూర్చి ఇంతకు మునుపు నేనుకొంత చరిత్ర వ్రాసితిని. ఇప్పుడు వివరముగా మరల వివరించితిని. ఈ పుస్తకము నకగు ముద్రణావ్యయమును జొన్నా ఈశ్వరయ్య దంపతులు భరించిరి. వారు పూర్వము ఈ భైరవుని సన్నిధిలో నుండినను ప్రస్తుతముపులివెందులలో నున్నారు. వారి పుత్రిక అకాల మరణమును విని, నేను చెలించి, ఆమె జ్ఞాపకార్థముగా ఈ పుస్తకమును ముద్రించమనగా వారందులకు అంగీకరించిరి. వారికి భైరవుడు ఆయురారోగ్య ఐశ్వర్యములు గలిగించుగాక అట్లే మమత ఆఫ్‌సెట్ ముద్రణాలయమువారు దీనిని సుందరముగా తీర్చిదిద్ది ముద్రించిరి. వారికికూడా భైరవుడాయురారోగ్య ఐశ్వర్యాభివృద్ది గలిగించుగాక. ఈ గ్రంథమును పఠించిన వారికిగూడా భైరవుడు ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధి గలిగించుగాక.

రచయిత
విద్వాన్ రాయరె

# మోపూరు కాలభైరవుడు

సీ॥ అఖిల భారతమనకాదిదేవుండైన
తిరుమలేశుని గిరిదరులనున్న
కడప మండలమునకగ్రభాగంబైన
పులివెందులందున మొలికినాట
నల్లచెఱువుపల్లె కల్లంతతూర్పున
మొగమూరునది తీరభాగమందు
మోహనగిరిపైన మోపూరుపురమున
కాపురంబున్నట్టి ఘనవిభుండు

తే॥ తానుగా పుట్టిపెరిగిన దైవమైన
దేవదేవుండు భైరవదేవుడుండు
పావనంబైన భక్తుల పాలివాడు,
పోయిదర్శింప ముక్తిని పొందగలరు.

.... విద్వాన్ ధాయరె

సీ॥ మోహనాచలవాస మోహభూతోచ్చాట
భైరవేశ్వర భక్త భయవిదార
మౌనీంద్ర సంస్తుత్య మర్దితారి సమూహా
ఘోరపాపవినాశ కులశధార
వాసవాది సురేంద్ర వంద్యమానపదాబ్జ
వాంఛిత మందార వజ్రకాయ
భోగభూషణ భూరి భోగభాగ్య సమేత
రత్నకేయూర విరాజరూప

తే॥ నిఖిల భువన ప్రశస్త వినీలదేహ
కాంతిపుంజ విరాజ విఖ్యాత మూర్తి
భైరవేశ్వర మోపూరు పురనివాస!
కాలభైరవ భక్తుల కావుమయ్య.

గుడుల బడులను మడులను చెడుపునట్టి
బటుల చెటులను విటులను నటులనెల్ల
పాపులను పాపమనకుండ రూపుమాపి
నిన్ను నీవైన కాపాడుకొన్నచాలు
.... విద్వాన్ రాయరె 4-2-74

ఒకప్పుడు ఇచ్చట చెట్లు చేమల నరికి మేకల గొఱ్ఱెల మేపువారిని, గుడుల గోపురములలోని ఇటుకల పడగొట్టి తలుపుల ద్వారబంధములను దూలములను స్తంభములను చీల్చి సారాయి కాచుటకు ఉపయోగ పరచువారిని, వాదించి వారింప చేతగాక దేవునే కాపాడు కొనుమని వ్రాసిన వ్రాతలు, ఈ ప్రదేశమున ఇచ్చటి శాసనములను, పురాణ ఇతిహాస చారిత్రకాంశములను కొన్నింటిని, నేను వ్రాసిన "యల్లారెడ్డి గాయముల" పీఠికలో కొంతవరకు పొందుపరచి, విడిగా కొన్నిపుస్తకములనుముద్రించి ప్రచారము గావించితిని. ఈ పుస్తకముల ముద్రణావ్యయమును కూడ నేనేభరించి భక్తులకు ఉచితముగా పంపిణీ చేసితిని.

ఏ విధమైన పూజా పురస్కారములు లేక ఉనికినే కోల్పోయిన ఈ ప్రదేశమును చూచి లోలోన కుందుచుంటిని. అట్టి సమయమున జోగి సుబ్బన్న నా దగ్గరకు వచ్చి "ఈ స్థల మహాత్మ్యమును కాలభైరవుని ఘనతను చాటుచు కొంత సమాచారమును వ్రాసి యివ్వండి" నేను పర్యటన చేసి దేవుని ప్రచారము చేసెదను అన్నాడు. నేను కొంత ఆలోచించి వేమన యోగిని అతని నీతి శతకమును గూర్చి చెప్పుచు గుఱ్ఱముమీద పచ్చబట్టలను కట్టుకొని ప్రచారముచేయు వేమయ్యలవలె బ్రతుకనెంచిన జోగికి ఈ క్రింది విధముగా వ్రాసి యిచ్చితిని. అతడు కొన్నాల్లు గుఱ్ఱముపై తిరుగుచు సంపాదించు కొనుచుండ నొకనాడు నీవునేను వ్రాసియిచ్చినదానితో ప్రచారము చేయుచు జీవించుచున్నావు. మంచిదేకాని నీవుపొట్టపోసికొనుటకు మాత్రమేనేను వ్రాసియిచ్చినది ఉపయోగ పెట్టుకొనక దేవాళయాభివృద్ధికి పాటుపడుము లేకున్న నీవు చేయుపాపమునకు నేనకూడ బాధ్యుడనయ్యేదనని హెచ్చరించితిని తరువాత ఆజోగి దేవాళయాభివృద్ధికి కొంతశ్రమపడినాడు. ఆనాడు నేను వ్రాయించి యిచ్చిన ప్రచార పత్రము నిందు పొందుపరుచు చున్నాను.

## మోపూరు భైరవేశ్వరస్వామి దేవాళయము
## దాని వివరణ

మోహన శైలము నల్లచెరువుపల్లె గ్రామము, పులివెందుల తాలూక,కడప జిల్లా,ఆంధ్రప్రదేశము.వారికిలేని మహత్మ్యమును కల్పించి ప్రచారము నిమిత్తమిట్లు లిఖించితిని. ఒకప్పటి పీఠాధి పతులైన జోగుల పూర్వీకులు గావించిన పుణ్యకార్యములను మనస్సులోపెట్టుకొని వ్రాయించిన ప్రచారపత్రము:-

-: శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య, పదవాక్య ప్రమాన పారావార పారీన ,అష్టాంగ యోగానుష్ఠాన షట్కర్మ నిరత మోహనాచల కాలభైరవ పీఠాధీశ్వర శ్రీశ్రీ చంచలనాధస్వామి వంశోద్భవ సుభానాధస్వామిగారిచే ప్రేషిత ప్రచారపత్రము :-

ప్రస్తుత క్రీడాభిరామము ముద్రిత గ్రంధములో ఈ పద్యము లేకున్నను పెద్దపాటి జగన్నాధకవి ప్రబంధ రత్నాకరములోనున్న వల్లభరాయుని వీధినాటకము క్రీడాభిరామములోని దని ఉదహరించిన పద్యమును ఈ క్రింది దానిని వ్రాసితిని.

॥సీ॥ చంద్రఖండములతో సరివచ్చునవచ్చు
విమల దంష్ట్రాప్రరోహముల వాని
పవడంపుకొనలతో ప్రతివచ్చునవచ్చు
కుటిలకోమల జటా చ్ఛటలవాని
ఇంద్రనీలములతో నెనవచ్చు ననవచ్చు
కమనీయతర దేహ కాంతివాని
ఉడురాజు రుచులతో నెనవచ్చు ననవచ్చు
చంచన్మహాట్టహా సములవాని

॥సీ॥ సిగ్గుమాలిన మొలవాని చిరుతవాని
నెల్లకాలము ములికినాడేలువాని
అర్థి మోహూర నవతార మైనవాని
భైరవుని కొల్వవచ్చిరి భక్తవరులు

॥ చ ॥"ముదమున ముల్కినాటి పురమోహన శైలసుకర్ణ కందరా సదనుడు కాలభైరవుడు శంభునిపట్టి సమగ్రవైభ వాభ్యుదయ పరంపరా విభవముల్ కృపసేయు కవీంద్ర కాంక్షిత త్రిదశ మహీరుహంబునకు తిప్పయ వల్లభరాయ మంత్రికిన్"

శ్రీ భక్తమహాశయులారా! వినుకొండ వల్లభరాయకృత మగు క్రీడాభిరామము వీధి నాటకములోని పై పద్యములను బట్టి, పూర్వ మీ ప్రాంతమునకు ములికినాడను పేరు గలదనియు ఇచ్చట మోహనశైలము, మోహనగిరి, మోహనాచలము, మోపూరుతిప్ప, మోపూరు కొండ అను పేర్లతోనొక ఎత్తైన ప్రదేశము గలదనియు ఆ కొండమోపున మోపూరు అను గ్రామము గలదనియు అచ్చట కాలభైరవుడను దేవుడున్నాడనియు తెలుచున్నది.

ఈ విషయము కడపజిల్లా పులివెందుల తాలూకా నల్లచెరువుపల్లె గ్రామమునకు తూర్పున ముఖమాలా నదీతీరాన నున్న మోహన శైలముపై మోపూరు పురమున వెలసిన భైరవక్షేత్రమును చూచినవారికి కన్నులకు కట్టినట్లుండును.

ఈ దేవుడు మానవ నిర్మితమై ప్రతిష్టింపబడినవాడుకాడు. స్వయంభూ ప్రతిమ దాదాపు 13 అడుగులు ఎత్తు 10 అడుగులు వెడల్పుగల శిలావిగ్రహముచుట్టు దేవాలయము నిర్మింపబడినది. వి గ్ర హ ము చా లా ఎత్తున్నందున ఒకే అంతస్తు నిర్మింపలేక రెండంతస్తులగుడి,గోపురమునునిర్మించిరి.దేవుడుభూమిపుట్టినప్పుడు పుట్టినవాడైనను ఆలయనిర్మాణముయొక్క కాలము తెలియలేదు.

ఇచ్చటగల కొన్ని ఆధారాలను బట్టి భస్మాసురుడు తపము గావించి, శివుని ప్రత్యక్షము గావించుకొని, తనహస్తమునెవరి తలపైపెట్టిన వారు మరణించునట్లు వరమునుపొంది, దానిని శివునిపైననే పరీక్షచేయతలంపగా, శివుడు పరుగిడెను. అప్పుడు విష్ణువు మోహినీయవతారమున వానిని కామింపజేసి,భస్మమును పరిశుభ్రము చేసుకొనిరమ్మనగా, వాడు క్రింది నదిలో స్నాన మాడుచు తనతలపై తనహస్తమును పెట్టుకొనగా మరణించెను. విష్ణువు మోహినీరూపమున వాని పీచమడచినందున ఆ గిరికి మోహినిగిరి అనుపేరు కలిగెననియు నానుడి కలదు.

ఇప్పుడు అచ్చటగల శాసనములనాధారము చేసుకొని చూచినచో అప్రాంతమును కొన్నాల్లు కాకతీయులు, విజయనగర రాజులు పాలించినట్లు తోచును. శాలివాహనశకము 1231, 1272, 1347, 1452, 1466 వ సంవత్సరములలో వ్రాసిన దానశాసనములు గలవు. ఇచ్చట సర్వమత సామరస్యము కల దనుటకు కూడా నిదర్శనములు గలవు. శివ, కేశవ, వినాయక, కుమారస్వామి, మహిషాసురమర్ధిని మొదలగు విగ్రహములు, బౌద్ధారామము వంటి దేవాలయములు గ ల వు. ఇవన్నియు ఒకప్పుడు గండికోట సంస్థానమునకు చెంది ఉండినవనియు ఈ ప్రాంతమును అయ్యపరసు అనురాజు పాలించెననికూడతెలియుచున్నది. ఇచ్చట కవి, పండిత, గాయక, నటశేఖరులున్నట్లు అశేష దేవ విద్వజ్జనులున్నట్లు రససిద్ధులైన యోగులు, సిద్ధులు, జ్ఞానులు,

ఋషులున్నట్లుకూడా విదితమగుచున్నది. ఇచ్చట యోగులే జోగులై మోపూరు జోగులను పేరుతో పీఠాధిపత్యము వహించియుండేవారు. కొంతవరకు ఈ తంబల్లవారు కూడ క్షేత్రాభివృద్ధికి కారకులైయుందురు. ఈ దేవునకు గ్రామములు, భూములు, వరహాలు, సువర్ణాభరణములు రాజులు దానమిచ్చినట్లు శాసనములు కలవు. ప్రతియేట వైశాఖ శుద్ధ పున్నమినాడు తిరుణాళ్ళు జరుగును. పురాణచరిత్ర ప్రసిద్ధమైన ఈ దేవాలయమును పునరుద్ధరించుటకు ప్రచారము గావింపవచ్చిన జోగికితోచిన ధనధాన్య సహాయముచేసి దేవాలయ అభివృద్ధికితోడ్పడ కోరెదను.

ఇట్లు, విద్వాన్ రాయరె. 4-2-74

అనురీతిగ నేను వ్రాయించిన ప్రచార పత్రమునకు బుద్ధారెడ్డి ధర్మకర్త, పోలీస్ పటేల్ సిద్ధారెడ్డి, జనార్ధనరెడ్డి గ్రామ సర్పంచ్, అనునామములు ముద్రించి ప్రచారము గావించుచుండెను. ఇందులో నాకేవిధమైన స్వార్థముగాని లాభాపేక్షగాని లేక చేసిన దేవుని ప్రచారము అస్తు:-

ఇక ఈ క్షేత్రముయొక్క ఉనికి, దానిమహిమ, నిర్మాణము, దానిచరిత్ర, పరిపాలన మొదలగు వానినిగూర్చి వివరించెదను

సాధారణముగా మన పుణ్యక్షేత్రములను, తీర్థములను, నగరనిర్మాణములను, పరిశీలించినచోనవియన్నియు కొండలపైన నీటి సౌకర్యములుగలచోట వృక్ష సంపద ఉన్నచోట, నదీతీరముల యందు నిర్మించి యున్నారు. తి రు మ ల శ్రీ వెంకటేశ్వర మందిరము

చుట్టు కొండలు కలిగి అచ్చట పడిన వర్షపునీరు ప్రవహించు చదరముగానున్న ప్రదేశమునుచూచి, నీరు ఎప్పుడు ఇంకిపోని ప్రదేశమున నిర్మింపబడినది. అట్లే శ్రీశైలం కూడా చుట్టు కొండలనడుమ ఊటబావులుగల ప్రదేశమును, క్రింద పాతాలగంగ (కృష్ణానది) ప్రవహించు ప్రదేశమునుచూచి దేవాలయము నిర్మింపబడినది. అట్లే గంగానదీతీరమున కాశి, యమునానదీతీరమున ఆగ్రా తుంగభద్రానదీతీరమున విజయనగరము మొదలగునవినిర్మింపబడినవి .మహానంది,శ్రీకాళహస్తి మొదలగునవికూడా నీరుగల ఏరుగల ప్రదేశములందే కలవు కదా! ఇక మోపూరుభైరవ దేవాలయముగూడా ముఖమాలా నదీతీరమున ఉత్తర దక్షిణ ప్రవాహముగల త్రివేణి సంగమము జరుగునట్టిచోట నిర్మింపబడినది. ముఖమాల, గుర్రప్పయేరు, ఉద్దండవాగు, కలియుచోటగల మోహనశైలముపై ఈ గుడి నిర్మాణము జరిగినది.

కొండపై ఒకవార చివర ఏటవాలుగా నున్న ప్రదేశమున నిలువుగనున్న ఒక గుండునుచూచి ఏటవాలుగా నున్న ప్రాంతమును చదునుచేసి, ఆమట్టి కొట్టుకొని పోవకుండునట్లు రాతికట్టడముకట్టి, మరల చదరముచేసి రెండవ రాతికట్టడము కట్టి, దానిపై కోటగోడ అనగా ఆలయ ప్రాకారమును నిర్మించి ఉన్నారు. ఆ కొండపై నల్లనిగుండ్లు అధికముగా ఉండగావానిని శ్రావణములతో చీల్చి చుట్టు ప్రాకారమును, నట్టనడుమ దేవాలయమును నిర్మించినారు. కొండమోపున ఖాలీస్థలము ఎక్కువగ నున్నందున అచ్చట మోపూరు అను ఊరు జోగులకు పూజారులకు (తంబళ్ళవారు)

ఉండుటకు నిర్మాణము జరిగినది. ఆ మోపూరునందే దేవునకు సంబంధించిన భటులు, వాయిద్య కారులు, నృత్యకారులు, దేవదాసినులు కూడా ఉండినట్లు తెలియుచున్నది. అందుచే మోపూరుఅనుఇంటిపేరు బ్రాహ్మణులు మొదలు మంగలి, చాకలి,తలారి, మాదిగవాండ్లకు కూడాకలదు. సుమారు 100 ఏండ్ల క్రిందట ఇచ్చట ఊరు ఉండినది. తరువాత రాజపోషణలేక జీవనముగడువక వారంతవలసపోవ, మోపూరు శిధిలమై పోయినది. వలసపోయి ఊరూర ఉన్నవారు ఇప్పటికి మోపూరు అను ఇంటి పేరుగలవారు గ్రామాంతరములందు గలరు. నల్లచెరువుపల్లెలోకూడ ఉన్నారు. అప్పటి బ్రాహ్మణులకు, పూజారులకు, జోగులకు మాన్యములిచ్చినవి ఇప్పటికికూడ ఆపేర్లతోనే పిలవబడు చున్నవి. వెంకటయ్య తోటలు, జోగోని తోటలు, శాస్త్రులతోటలు అనుభూములు ఇప్పటికి కలవు.

## స్థలమహాత్మ్యము

విక్రమార్కునకు భోజరాజునకు సంబంధముగల ఒక కథ గలదు. విక్రమార్కుడు ఉజ్జయినీ పరిపాలకుడు. ధర్మన్యాయ బద్ధుడు. ధైర్యసాహసములు గలవాడు, దాన ధర్మపరుడు, కవి పండిత పోషకుడై, పరిపాలించు చుండెను. అనగా? దాదాపు రెండువేల 2000 యేండ్లకు పూర్వము అతని రాజ్య పతనా నంతరము, భోజుని పరిపాలనలో ఒకనాడు, భో జు డు సైన్యసమేతుడై పోవుచుండగా ఒకచోట జొన్నచేను వేసి మంచ నిర్మించి ఒక పాప కావలిగాయుచుండినది. ఆ మంచపైనుండి సైనికులనుచూచి "సైనికులారా రండి మాచేనుబాగుగా పండినది జొన్న కంకులను కోసుకొని పిసుకుల్లను తినండి" అని ఆహ్వానించినది.

సైనికులకది క్రొత్తపంటకాన చేలో ప్రవేశించి కంకులను కోసుకొని తినుచుండిరి. ఇంతలో ఆ అమ్మాయి దిగివచ్చినది. సైనికులు కంకులను కోసితినుటచూచి" అయ్యా ! మేము బీద రైతులము, తిండిలేని వారము, కష్టపడి బ్రతుకు వారము. మీరంతాయిట్లు ఎందుకు పాడుచేయుచున్నారని" బ్రతిమాలినది. సైనికులు పాపమీ అమ్మాయి చేను ఎందుకు పాడుచేయవలెనని అంతా పొలముదాటి పోయినారు. ఆ అమ్మాయి మరలమంచెపైకెక్కి సైనికులు పోవుచుండుట చూచి అయ్యా రండి కంకులు తినండని ఆహ్వానించినది. సైనికులు కూడా కొంత మందివచ్చి కంకులు తినుచుండగా మరలాముందువలే దిగివచ్చి నిందించినది. అదిగమనించిన భోజుడు ఎందుకీమె మంచపై నున్నపుడు మంచిబుద్ధితో ఆహ్వానించుచున్నది. దిగినపుడు నిందించు చున్నదని ఆస్థలములో నేదోమహిమ ఉన్నదని తలంచి త్రవ్వించి చూడగ నట విక్రమార్కుని ద్వాత్రింశత్సాలభంజికలు గల సింహాసనముండినది. దానిని రాజధానికి తీసుకొనిపోయి ఎక్కుటకు ప్రయత్నించగ ఒక్కొక్కమెట్టుపై నున్న ఒక్కొక్కబొమ్మ విక్రమునికి సంబంధించిన సాహసౌదార్యగుణమును తెలుపు కథను చెప్పి, నీవట్టి గుణవంతు డవేని అధిరోహించమని నుడివినట్లు కథ కలదుకదా? అట్లే స్థల మహాత్మ్యముకూడ ఉండవలెను.

ఎంత స్థలమహత్మ్యమున్న "నీచైర్గచ్ఛత్యు పరిచదశాచక్రనేమి క్రమేణ" అన్నట్లు కాలచక్రము దొర్లినపుడు చక్రముయొక్క కమ్మి క్రిందికి మిందికి పోవునట్లు ఏ మనిషికైన ఏస్థలముకైన ఏక్షేత్రమునకైన ఏరాజుకైన ఏపట్టణమునకైన ఉచ్ఛనీచస్థితులు జరుగు చుండును. అభివృద్ధి

క్షీణములు సమయాను కూలముగా జరుగు చుండును. కాళిదాసు చెప్పినట్లు "తేజోద్వయస్య యుగ పద్వ సనోదయాభ్యాంలో కోనియమ్యత ఇవాత్మ దశాంతరేషు" సూర్య చంద్రులిద్దరు సమానమైన వారైన సాయం సమయమున సూర్యుడస్తమించుట, చంద్రుడుదయించుట జరుగును కదా? ఉషఃకాలమున చంద్రుడస్తమించుట సూర్యుడుదయించుట జరుగును. అట్లే ఒక రాజకీయ నాయకునకు పతనము, మరియొక రాజకీయ నాయకునకు ఉత్థానము, దశాంతరములుగా జరుగుచుండును. ఈ మోపూరు క్షేత్రమునకు కూడ కాకతీయుల విజయనగర రాజుల కాలమునాటి వైభవము తగ్గినది. మరల తప్పక మంచి దశ రాగలదని ఆశించెదము.

ఈ మోహన శైలముపైన యోగులు, ఋషులు, సిద్ధులు, మునులు,కలరనియు వారుఅశరీరులై సంచరించుచు తపమాచరింతురనియు, కొందరికి పుణ్యాత్ములకు కనపడుచుందురని కూడ ప్రతీతిగలదు. అట్లు యోగులు జోగులుగా రససిద్ధులైనమునులు, ఋషులు, పూజారులుగా (తంబల్లవారు) అవతరించి యుండవచ్చును. వారంతా కొండపైకూడినపుడు ఆ ప్రాంతమునభివృద్ధి చేయుటకు ఏవేవో ప్రణాళికలువేసుకొని రాత్రి నిద్రించి ఉదయమున ఎవరెవరి పనిమీద వారు, పోవుచు క్రిందికిదిగగానే అంతయు మఱచిపోయెదరట.

అందులకే "మోపూరు జోగల వాటము" అనుసామెతపుట్టినది. ఎవరైన ఏమైన చేస్తామనిచెప్పి చేయనిచో వారిని మోపూరు జోగులనికూడ అనుచున్నారు.

## దేవాలయ నిర్మాణముదాని - కాలము.

ఈ దేవాలయ నిర్మాణ కాలమును నిర్ణయించుటకు సాధ్యముగాదు. ఎందుకనగ మానవనిర్మిత విగ్రహమ్మై, మానవ ప్రతిష్ఠితమైనచో కాలమును నిర్ణయించ వచ్చును సహజముగా నున్న శిలకు ప్రాణ ప్రతిష్టగావించి యోగులు, ఋషులు ఆలయమును నిర్మించి ఉన్నారు. మహనీయులు స్థాపించిన శిలయైనను దైవత్వమును పొందును. "శిలాదైవత్వమాప్నుతే" శిల దైవత్వమును పొందుటేకాక "ఋషీనాంపున రాద్యానాం వాచమర్థోనుధావతి" ఋషులైనవారు ఇచ్చట ఇట్లు జరుగునని అన్నచో అట్లేజరుగును. సామాన్యులు జరిగినదానిని జరిగినదని చెప్పుదురుగానీ ఋషులు జరగని దానినిగూడ వాక్శుద్ధితో జరుగునట్లు చేయుదురు.

ఈ కొండపైనున్న నల్లబండలను శ్రావణములతోచీల్చి ఆలయమును నిర్మించిరి. అట్లు చీల్చిన బండలు, వానికి శ్రావణములతోవేసిన రంధ్రములు ఇప్పటికి గూడ గుర్తుకు కలవు. అట్లు చీల్చి మొలచిన బండలను

రససిద్ధులగు మునులు తాకినచోనవి సులభముగ పైకి యెత్తుటకు వీలుండెడివట. లేనిచో అంత పెద్ద పెద్ద బండలను గుడులకు గోపురములకు ఎత్తుటకు ఎట్లుసాధ్యపడును.వారికితగిన సమయము యామము (జాము) తెలిసియుండును దీనికొక ఉదాహరణము ఈ లోపల ధ్వజస్తంభ ప్రతిష్ఠ జరుగునపుడు దాని పైకిలేపునపుడు ఎందరో ఎంతగానో ప్రయత్నించినను అది పైకిలేయలేదు. అప్పుడు అంతా ఒక్కసారి గట్టిగా! భైరవా! అనిఅరచి ఎత్తగా ధ్వజస్తంభము సులభముగ బలిపీఠము పాదులో నిలబడినది. అది ఆ స్థంభమునకు జాము సరిపోయి ఉండవచ్చును.

గర్భగుడి గోపురము దాదాపు రెండువేలయేండ్లకు మునుపే నిర్మాణము జరిగియుండును. తరువాత ముఖమండపము మొదట గోపురము కట్టించిన కాలములు అచ్చట శాసనములవలన తెలియు చున్నవి. దేవాలయమునకు పడమరనున్న మొదటి గోపురమును కట్టించిన శాసనముగలదు.

**1.** స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహనశక 1347 అగు విశ్వావసు సంవత్సర ఆశ్వీయుజ బహుళ అష్టమి స్వస్తి శ్రీమత్ రాజాధిరాజ రాజపరమేశ్వర అరియరాయ విభాగ భాసగి తిప్పవరాయరగండ హిందూరాయ సురత్రాణ పూర్వ పశ్చిమ దక్షిణోత్తర చతుస్సముద్రా ధీశ్వరుండు వీర విజయ బుక్కరాయ మహారాయల గర్భరత్నాకర

దరమ చారిత్ర్య నిత్యగాంభోజ విశ్వ కాత్యాయణ సత్యహరిశ్చంద్ర ఉదయ బాలభాస్కరుండైన శ్రీమన్మహామండలేశ్వర శ్రీ వీరప్రతాప కుమార దేవమహారాయరు విజయనగర పట్టణమునందు సుఖ సంగతా వినోదంబున రాజ్యము చేముచుండగాను, ఆదేవరాయ మహారాయల నిజభృత్యుండైన స్వస్తిశ్రీమదుద్దండర గోగిగజసింహమై కవితామండలిగండ బిరుదాంకితులైన బొప్పదోవుని విరూపణ్ణంగారి కుమారుడు తి రు మ ల రా య ని ం గా రు తమ తల్లులు తిమ్మాయంమంగారికిని నాగాయంమంగారికిని, తమ అక్కగారు తిరుమల్దేవమ్మ గారికిని పుణ్యముగాను, మోపూరుభైరపదేవర సన్నిధిని పశ్చిమ భాగమందు తమ బందువముల తిబ్బనాయని చేతను ఆచంద్రార్క స్థాయిగాను కట్టించిన గోపురము. ఈ శాసనము మొదటిగోపురముతరువాతపడిఉన్నది. ఈకుమార దేవమహారాయలు విజయనగరాధీశ్వరుడైన ప్రథమ బుక్కరాయలకు అతని దేవేరి దేపాయి గర్భమున పుట్టినవారిలో పెద్దవాడు. ఇతడు 1374లో ఉండెను, అతనికి కుమార కంపరాయలను నామముకలదు. ఇతడు తురష్కులతో పోరాడి దక్షిణదేశము నంతయు వి జ య న గ ర రాజ్యములో కలిపెను. ఇతడు, ఇతని భార్యలిద్దరుకూడ కవులు.

**పులివెందుల భూమిలో మడిదానము చేసిన శాసనము.**

**2.** స్వస్తిశ్రీ జయాభ్యుదయ శకవరుషంబులు 1272 నందన సంవత్సర చైత్ర.... స్వస్తిశ్రీ మంమహామండలేశ్వర హరిరాయవిభాసగి తప్పవరాయగండ పూర్వ సముద్రాధిపతి వీరశ్రీసావంణయొడయలు

ఉదయగిరి సింహాసనమున రాజ్యము చేయుచుండగా మా తండ్రి తప్పవరాజును కుంనుతమ .....తమ అమ్మగారికిన్ని పుణ్యముగాను మోపూరుభైరవేశ్వర అంగరంగవైభోగాలకు పులివెందులభూమిలోను సాగు నందున్న ముల్కినాటి భూమిలోను చెరువు క్రింద 2 మడిన్ని దారా పూర్వకముగా ఆచంద్రార్క స్థాయిగాను యిచ్చెను.

ఈ ఇదంమానమునకు యవ్వరు విఘ్నము సేసినాను.గంగ కరుత ఆవుల పొడచిన పాపాన పోయినవారగుదురు.ఈ శాసనము భైరవేశ్వ ద్వారము మొదటి ఎడమరాతి పై చెక్కబడినది. ములికి నాటిలోని పులివెందుల అనుటచే ఎనిమిది నూర్లయేండ్లకు పూర్వమే ఈ శాసనమున్నదిగాన పులివెందుల ఎనిమిదినూర్ల ఏండ్లకుమునుపే ఉండినట్లు తెలియుచున్నది. మరి అచ్చుట ఏచెరువుండెనో మడి ఎచ్చుటుండెనో తెలియదు.

3. 1231 నందననామ సంవత్సర మాఘ బహుళ సప్తమిన మో పూ రు భై ర వు ని దేవాలయ ముఖమండపము బోగలదేవి బ్రహ్మదేవుని మనుమడు కట్టించినట్లు గలదు. వీటిని బట్టి చూడగా నీదేవాలయము ఎనిమిది నూర్ల యేండ్లకు పూర్వమే కట్టించినట్లు తెలియచున్నది.

క్రీస్తుశకము క్రీ॥శ॥ శాలివాహణ శకము కంటే 80 సంవత్సరములు ముందుకలదు.ఈభేదము ననుసరించి శాలివాహన శకమునకు కలకాల భేదమును గమనించవలెను.

## 4. అచ్యుతరాయల కాలమున చేసిన దాన శాసనము.

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరషంబులు 1452 అగు నేటి వికృతి సంవత్సర వైశాఖ శుద్ధ 3 శ్రీ మద్రాజాధి రాజ రాజ పరమేశ్వర వీరప్రతాప వీర అచ్యుతరాయ మహారాయలు విద్యానగరమందు రత్నసింహాసనారూఢుండై పృధ్వీ సామ్రాజ్యంబేలు చుండగాను ఘండికోటసీమలోని మోపూరుభైరవేశ్వరునికిభారద్వాజ గోత్రం ఆశ్వలాయన సూత్రం రుక్కుశాఖాధ్యాయులైన రాయసం కొండమరుసయ్యగారి కుమారుడైన అయ్యపరుసుగారు యిచ్చిన దాన శాసన క్రమమెట్లంనను స్వామి నాయంకరానకు పాలించ నవతరించిన ఘండికోట, ఘండికోట దుర్గానకు చెల్లే మోపూరు భైరవేశ్వరునికి చతగ్రామాలను యెందంకి దుర్గానకు అచట దుర్గ దన్నాయని వర్తనలువరహాలు 235అక్షరాలయిన్నూటముప్పైఅయిదు వరహాలను మోపూరి భైరవేశ్వరునికి వైశాఖ శుద్ధ మొలకల పున్నమ రధమహోత్సవానికి దేవుని అంగరంగ వైభవాలకు మాస్వామి అచ్యుతరాయలకు పుణ్యంగాను తధా తిధి తదియ పుణ్యకాలమందు సిద్ధవటం జ్యోతి పిద్ధేశ్వరుని సన్నిధిని సహిరం న్యోదక దాన ధారా పూత్యకంగాను త్రికరణ శుద్ధిగాను ధారవోసి యిస్తమి ఆ చంద్ర స్థాయిగాను చెల్లిరావలెనని యిచ్చిన ధర్మశాసనము. ఈ ధర్మానకు యెవ్వరు విఘ్నముచేసినాను వారణాసిలోను గోబ్రాహ్మణులవధించిన దోషాణం పోయినవారు. గంగ లోపలను కపిల ధేనువును చంపిన పాపానబోయినవారు.

"స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తాను పాలనం పరదత్తా పహరణం యత్స్యాత్ స్వదత్తం నిష్ఫలం భవేత్".

## 5. సదాశివరాయల కాలమున చేసిన దానశాసనము

శుభమస్తు:

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు1466 అగు నిజక్రోధి సంవత్సర మాఘ శు॥ 7 సోమవారము శ్రీ మద్రాజాధి రాజరాజ పరమేశ్వర శ్రీ వీరప్రతాపశ్రీవీరసదాశివదేవమహారాయరు విజయ నగర పట్టణమునందును రత్నసింహాసనాధుండై పృధ్వీ సామ్రాజ్యము చేయుచుండగాను శ్రీ మన్మహా మండలేశ్వర ఆత్రేయ గోత్రం సోమ వంశోద్భవులైన నంద్యాల అవుచ దేవ మహారాజ పౌత్రులైన నరసింగయ దేవమహారాజ పుత్రులైన శ్రీ తిమయదేవ మహారాజులుగారు గండికోట సీమలోనిదేవస్థానములుఅగ్రహారాలు అందలి నానాగోత్ర... సూత్ర నానాశాఖాద్యాయ పవిత్రులైన అశేష దేవవిద్వన్మహాజనాలకు యిచ్చిన సర్వమాన్య ధర్మశాసన క్రమ మెట్లన్నను..... సదాశివ దేవమహారాయరు మాకు నాయంకరానకు పాలించిన గ ం డి కో ట సకలసీమలోని దేవతా గ్రామాలు అగ్రహారాలన్నిన్ను పూర్వాన ఘండికోటకు అచటి దుర్గవర్తన దణ్ణాయని వర్తన బిడిగెకాణికకోటలు మొదలైనవి యంనిగలవు. అంనింని యధాధితి రధసప్తమీ పుణ్యకాలమందు పినాకినీ నదీతీర మందు లోకపావన శ్రీ నృసింహదేవుని సన్నిధిని శ్రీమదహోబల నృసింహ భృతిగాను, సర్వమన్యంగానిసేస్తిమి, కానమీపుత్ర పౌత్ర పారంపర్యంగాను, ఆచంద్రార్క స్థాయిగాను క్రత్వాది అనుష్టానాలు చేసుకొని సుఖాన ఉండేది.

ఈ మర్యాదన మోపూరు భైరవేశ్వరుని నిత్యధూప దీపనైవేద్య అంగ రంగ వైభవాలు రథమహోత్సవాలు మొదలైనవానికి భైరవేశ్వరునికి చేరు గ్రామాలను అచటిదుర్గ దశోనివర్తిని బెండిగినికి కోటలు మొదలైనవి యంనిగలవు. అంనింని ఈ తథాతిధిపుణ్యకాలమందు సహిరణ్యోదక దానదారాపూర్యకంగాను సర్వమాణ్యంగాను ధారవోసి యిచ్చిన ధర్మశాసనం. ఈ ధర్మానకు ఎవరు ఏవిధమైనను విఘ్నం చేసిన గోబ్రాంహనులను వధించిన పాపానపోవువారు.

"స్వదత్తాద్విగుణంపుణ్యం పరదత్తాను పాలనం
పరదత్తాపహరణం యత్స్యాత్ స్వదత్తంనిష్ఫలంభవేత్"

ఈశాసనములు ధ్వజస్తంభమునకుదగ్గర ఉండినవి వీటివివర ములను నేను "యల్లారెడ్డి గాయాలు" అను పుస్తకము పీఠికయందు ప్రచురించి విడిగా కొన్నిపుస్తకములను తయారుచేయించి ప్రచారము నిమిత్తము ఉచితముగా పంచియుంటిని. ఎవరో మహనీయులు వాని వివరములను చదివి వాటిక్రిందనే 235 బంగారు వరహాలు కలవని భ్రమించి ఆశాసనములను ధ్వంసము చేసి ప్రక్కన వేసి వానిక్రింద త్రవ్వినారు. పాపము వారికి నిరాశ కలిగినందులకు భైరవుడు బాధపడి ఉండును. లేకున్న ఆదేవుడూరకెందుకుండెనో ఎరుగరాదు. మానవ నిర్మితమైన విగ్రహము క్రింద బంగారు నాణెములు, నవధాన్యములు వేయుదురు. అట్లే ఈ విగ్రహముక్రింద ఉండునని దేవుని వెనుకభాగమున కూడ రంధ్రము వేయుటకు

ప్రయత్నించి విఫలులైరి. అది స్వయంభూ లింగమని వారికి తెలియదు. ఇతరులు చేయించిన దేవాలయ గుడుల గోపురముల కాపాడినవారికి తాను చేయించిన ధర్మముకంటే రెండింతలు పుణ్యముండునని ఇతరులు ఇచ్చిన, చేయించిన దానధర్మములను అపహరించినవారికి తాను చేయించిన దానధర్మముల పుణ్యము నసించుననియు శాసనము క్రింద ఉన్న శ్లోకమునకు భావము.

అంతేగాదు పరులు కట్టించిన దేవాలయములు గుడులు గోపురముల పాడుచేయువారు గంగలో గోవులను బ్రాహ్మణులను చంపిన పాపమున పోతారని కూడకలదు. అట్టి నీతులకు భయపడు వారులేరు. ఎందుకనగా ఎంతో పవిత్రమైన సాత్వికాహారమునుతిని పరోపకారముచేయు బ్రాహ్మణులను బాధించు వారుగలరు. అంటే మంచివారు విజ్ఞానులు బ్రాహ్మణులు "జన్మనాజాయతే శూద్రః కర్మణాజాయతే ద్విజః" అనిగీతాచార్యులవారివాణి పుట్టినవారందరు అజ్ఞానులుగా నున్నపుడు శూద్రులే వారికిగల విజ్ఞానము చేత వారు చేయు సత్కర్మలచేత బ్రాహ్మణులగుదురని "జ్యాతిర్వర్ణంమయాసృష్టం గుణకర్మ విభాగశః" అంటే జాతులు కులములువారికిగల మంచి గుణములచేత వారుచేయు సత్కర్మవలన నేనే సృష్టించితినని గీతలో చెప్పబడినది. అట్టి వారిని బాధించు దుర్మార్గులకు అది తప్పుగా తోచుటలేదు.

గోవుల విషయము ఆలోచించినచో మరీ ఘోరముగానున్నది. పనికిరాని చెత్తా చెదారము తిని మనకు పవిత్రమైన క్షీరము నిచ్చుచున్నది. అందుచే "గో బ్రాహ్మణేభ్యః శుభమస్తు భూయంః" గోవులకు బ్రాహ్మణులకు మేలు గలుగుగావుత, అన్నారు. అట్టి గోవులను(తరుపు దూడలను)చంపితినువారికి పాపమేమి తెలియును కాన ఈశాసనములోని క్రిందిశ్లోకమునకు ఎవ్వరు భయపడుటలేదు.

నేను ఈశాసనమును ప్రకటించనంతవరకు అంటే 500 నూర్ల ఏండ్లవరకు ఆ శాసనముల జోలికి పోయిన మహనీయులు లేరు. అప్పుడు లేని దుర్మార్గులు ఇప్పుడుబయలు దేరినారు. అది కూడ నేను ప్రకటించిన తరువాతనే జరిగినది. ఆ పాపముకూడ నాకు కలుగునేమో? ఈ భైరవునిమూలమున నాకు సంప్రాప్తించకుండు గాక,ఐనా దేవునికిచ్చిన దానధర్మములను మడులను మాన్యములను ఆక్రమించువారికి, అనుభవించువారికి రానిపాపము నాకెందుకు వస్తుంది.నేను భైరవునిగూర్చి వ్రాసి ప్రచారము చేయించిన తరువాత కొంత అభివృద్ధి జరిగినది. దానికి ఒకవంక సంతోషించినను పాడుచేయు వారిని తలంచి బాధపడకతప్పలేదు. నా కనులముందే వృద్ధిక్షయములు జరుగుచున్నవి.

# క్షేత్రగాథ

భైరవేశ్వర దేవాలయము ఆంధ్ర ప్రదేశములోని రాయలసీమకు నడుమునగల కడప జిల్లాలో పులివెందుల తాలూకా వేముల మండలములోని నల్లచెఱువుపల్లె పంచాయతి హద్దులో కలదు ముఖమాలా నదీతీరముననున్న మోహనగిరి పైన కొండ మోపున దాదాపు 100సంవత్సరములకుపూర్వమే మోపూరుఅనుఊరుండెను ప్రస్తుతములేదు. అచట 100ఏండ్లకుపూర్వముజోగులు, పూజారులు పనిపాటలవారు కాపురము చేయుచుండిరి. వారందరికి మోపూరు అను ఇంటిపేరు కలదు. వారినే యిప్పటికి కొండమీది పూజారులు మోపూరుజోగులు అనిపిలుచుచున్నారు."మోపూరు"అను ఇంటిపేరు గలవారు ఇప్పటికి నల్లచెఱువుపల్లెయందు బ్రాహ్మణులు తలారులు (భైరవుని పల్లకి మోయువారు) మంగలి, చాకలి, వాయిద్యకారులు ఉన్నారు.

ఈ మోపూరు కొండదరిన కొండల, గుట్టల నీరుపారునది పెద్దయేరు,(గుర్రప్పయేరు)దాదాపు 50మైల్లనుండి పారు చిన్నయేరు. (మొగమూరు)సింహాద్రిపుర ప్రాంతమునుండిపారునది, పులివెందుల ప్రాంతమునుండి పారునది ఉద్దండవాగు, మూడునదులు కలయు చోటు, త్రివేణీ సంగమము జరుగును. అటనుండి ప్రవహించి సంగమేశ్వరముదగ్గర గండిఆంజనేయస్వామిదగ్గరనుండిప్రవహించు పాపాగ్నితో కలియుచున్నది. తరువాత కుందు, పెన్నా, చెయ్యేరు, మొదలగువానితో కలసిపోవుచున్నది.

ఈ త్రివేణీ సంగమ సమీపమున మోహనశైలముపై భైరవేశ్వర దేవాలయము కలదు. కొండ కొనన ఉన్న ఎత్తైన గుండుచుట్టు దేవాలయము నిర్మింపబడినది. అచ్చట లభ్యమగు నల్లగుండ్లను చీల్చి ఆలయమును నిర్మించి ఉన్నారు. దానినిగూర్చి వివరముగ వివరించి యున్నాను. ఎత్తైన స్వయంభూ విగ్రహమునకు ఎత్తైన గుడిని నిర్మించుటకు వీలుగాక రెండంతస్తులు నిర్మించినారు. మొదట అంతస్తులో పూజాదులు రెండవ అంతస్తులోఅభిషేకాదులుజరుగుచు న్నవి. ఈ క్షేత్రమును గూర్చిన కొన్ని పుక్కిడి పురాణములు గలవు అవి నమ్మదగినవిగా తోచలేదు. పశుల మేపుకొను పిల్లలు వ్రేలిగుండ్లాడు కొనుచుండగా నొకడోలుగుండు దొర్లుచు పోయి గుట్టపై పెరుగుచుండినదనియు మిక్కిలి ఎత్తుగా పెరుగుచుండగా భైరవుని చెల్లియలు అక్కపప్పూరమ్మ అదిచూచి యిక పెరిగిన నీకుగుడికట్టుట కష్టమని పెరగవద్దని తన చేయిదేవునినెత్తిపైపెట్టగా చేతిగుర్తు ఏర్పడినదని చెప్పుదురు. అప్పుడు భైరవుడు కోపించి త్రోయగా నామె కొండ క్రింద పడినదనియు ఆమెను ఓదార్చి మొదటిపూజ ఆమెకే ఇచ్చినాడనియు ప్రతీతి గలదు. అందుచే ముందు పూజ జంతు, పశుబలి, శక్తి స్వరూపినియగు ఆమెకే యిప్పుడుకూడా చేయుచున్నారు. మాంసాహారులను తృప్తిపరచుటకు ఈ జంతుబలి, రక్తపాతము యేర్పాటుచేసి ఉందురు.





"ముదమున ముల్కినాటి పురమోహన శైలసువర్ణకందరా సదనుడు కాలభైరవుడు" అను పద్యము క్రీడాభిరామమను వీధినాటకములోనిది అచ్చట సువర్ణ కందరము (గుహ) లేదుకానీ విభూతిగుహ అని అనునది ఒకటి కలదు దానిమీద గూడువలేనొక స్తూపముండినది. అదికూడా శిదిలమైనది. గుర్తులు మాత్రము కలవు. అది విభూతిగుహ అనియు దారిలో భస్మాసురుడు (భస్మము) విభూతి పూసుకొని ఘోరతపమాచరించుచుండెననియు తుదకు ఈశ్వరుడు ప్రత్యక్షముకాగా, తనచేయి ఎవరినెత్తినపెట్టిన వాడు భస్మమగునట్లు వరమును కోరెనట భోలాశంకరుడు తథాస్తు అనగా నా యసురుడు నీవరము నిజమోకాదో నీనెత్తిమీదనే పెట్టెదనని అచ్చటి శిలపై పెట్టెనట. ఆశిల పగిలిపోగా వానిహస్తము గుర్తు ఏర్పడెనట అప్పుడు శివుడు వానిచేతి కందకుండా పెరిగెనట. రాక్షసుడుగూడా మాయావిగాన పెరిగెనట. శివుని లింగముపై చేయి పెట్టగా హస్తము గుర్తు ఏర్పడినదట. ప్రాణప్రతిష్ఠచేసిన శివాకారము పరుగుతీసెనట. ఇకనేమి శంకరుడు పరుగును లంఘించగా భస్మాసురుడువెంబడించెనట ఇకశివునిఅవస్థచూడలేక అచట నున్న కేశవుడు మోహిని రూపమున అసురునిముందు హావభావముతో తలుకు బెలుకులు చూపగా వాడామెను చూచి శివునిమరచిపోయి, ఆమెవెంట పడెను. అసురుడు కామవాంఛను ప్రకటింపగా మోహిని తల స్నానమాచరించి పరిశుభ్రముగా విభూతిని కడుగుకొని రమ్మనెను. వాడును మో హాం ధు డై క్రింది నదిలో మ జ్జ న ము న కు పో యి తను నిమజ్జనము

గావించి తన చేతిని తలపై నిడుకొనెను. అంతటితో వాడు భస్మమైపోవగా వానిపీడ విరగడైపోయెను. శివునకు భయముపోయి మోహినిపై భ్రాంతి గలిగెను. అంతే బయ్యప్ప, అయ్యప్ప, అక్కపప్పూరమ్మ జన్మించిరి. ఆ భైరవుడే కాలభైరవుడుగా ప్రసిద్ధి గాంచెను. ఇక అయ్యప్ప అటనుండి శబరిమలచేరెను. అప్పటినుండి బయ్యప్ప, అయ్యప్ప పేర్లుకూడా కొందరుపెట్టుకొనిరి. ఘండికోటను పాలించు అయ్యప్ప అరును మోపూరుదేవళమునకు మాణ్యములు గూడా యిచ్చినట్లు శాసనము గలదు ఇది ఎంతమాత్రంనిజమోకాని విభూతిగుహ, సువర్ణకందరము, బౌద్ధారామముగ నిప్పటికి నందు గలదు భక్తులు దర్శింపవచ్చును.

ఇందులకు నిదర్శనముగ అచ్చట నిప్పుడు శివకేశవ విగ్రహములు ఆలయములు గణాధిపతి, కుమారస్వామి, మహిషాసుర మర్ధిని, మొదలగు విగ్రహములు గలవు. శివ, కేశవులకు ఆలయములు గలవు. కాని కుమారస్వామికి, గణపతికి, మహిషాసుర మర్ధినికి ఆలయములులేవు. ఆస్వాములు గాలికి,ఎండకు,వానకు,తపించుచున్నారు.ఎవరైన భక్తులుఆదేవతలకు గూడా ఆలయములు కట్టించి పుణ్యముకట్టుకొన్న బాగుండును అట్లే ఆంజనేయునికి అయ్యప్పకు వెంకటేశ్వరునికిగూడా గుడులు కట్టించిన అందరు దేవతామూర్తులు అచ్చటనుండి అందరికోరికలను తీర్చగలరని నా నమ్మకము. – ఈశ్వరుని కుమారులలో వీరభద్రుడు లేపాక్షియందు, కాళభైరవుడు మోపూరునందు ఆంధ్రదేశమునగలరు. కుమారస్వామి (సుబ్రమణ్యస్వామి) తిరుత్తణి, ద్రవిడదేశమున

(తమిళనాడు) అయ్యప్ప శబరిమలై కేరళ దేశము నందు గలరు. అయ్యప్పస్వామి ప్రచారము ఈ మధ్య ఎక్కువగా జరుగుచున్నది.

ఇందుగలరహస్యము నాకుతోచినది మీకుతెలుపుచున్నాను. ఉత్తరహిందూదేశమున శైవమతము శైవారాధన ఎక్కువగాగలదు. హిమాలయము, కైలాసము, కాశి మొదలగునవి శైవక్షేత్రములు. ఇక దక్షిణమున వైష్ణవాలయములు ఎక్కువగాగలవు. త్రిమతాచార్యులు ఆదిశంకరుడు, రామానుజులు, మధ్వాచార్యులు వారివారి మతాను సారముగా గీతకు భాష్యములు వ్రాసిరి. తరువాత కాలమున ఈ శివ, కేశవుల భక్తులలో శివుడుగొప్ప, కేశవుడుగొప్ప అనుభేదభావము గలిగినది. వైష్ణవులలో, శైవులలో వీరవైష్ణవులు వీర శైవులను తెగలు పుట్టినవి. చివరకు మా దేవుడెక్కువ మాదేవుడెక్కువ అనువాదములు ప్రబలి యుద్ధములు హత్యలుగూడా జరిగినవి. కాని శివుడుగాని కేశవుడుగాని పట్టించుకొనలేదు. ఇదంతయు మానవ కల్పితముగాన శివుడు కేశవుడు ఇరువురు గొప్పవారే మీరెందుకు తగవులాడెదరు అనుభావమును కల్పించి హరహరమూర్తిని సృష్టించిరి.

వారిలోతిక్కనఆద్యుడు"శ్రీయనగౌరీనాబరగుచెల్వకు చిత్తముపల్లవింప భద్రాయిత మూర్తియై హరిహరంబగు రూపముదాల్చి విష్ణురూపాయ నమశ్శివాయయని కొల్చెడు భక్తులకిచ్చమెచ్చు పరతత్వగొల్చెదననిష్ట సిద్ధికైయని, అను పద్యమును వ్రాసి శివకేశవులకు ఆ భేదమును సృష్టించుచు హరిహరాత్మయనునొక క్రొత్త మూర్తని సృష్టించి తన పుస్తకమును అంకిత మిచ్చెను. తిక్కన కాలము వాడే

హరిహర రాయలుకూడ విజయనగర రాజులుగూడ ఈ శివకేశవ అభేదమునేపాటించిరి కృష్ణదేవరాయలు తరువాత అచ్యుతరాయలు సదాశివ రాయలుకూడా శివకేశవాలయములకు సమానముగ దానములు ధర్మములు ఆభరణములు చేయించిరి. ఆవిధముగనే ఈ మోపూరునందుకూడ అందరకు సంబంధించిన విగ్రహములను నిలిపిరి. ఇంకను ముందునకుపోయి ఈ శివకేశవులకు జన్మించిన వారుగానే అయ్యప్ప బయ్యప్పల పేర్కొనిరి. అయ్యప్పకూడ ఈ శివకేశవులకు పుట్టినవారేకాన అందరు ఆయనను ఆరాధించు చున్నారు తరువాత కొంతవరకు ఈవైష్ణవశైవ భేదమంతరించినది శైవ వీరశైవులకు వైష్ణవ వీరవైష్ణవులకు అప్పుడప్పుడు తగవులు గలుగుచునే ఉండును.

తిరుమల వెంకటేశ్వరుడు మావాడని వైష్ణవులు, మావాడని వీరవైష్ణవులు, తగవులాడుచు దేవునకు V వి మార్కు నామము తీయవలెనని వైష్ణవులు, Y వై మార్కు నామము తీయవలెనని శ్రీ వైష్ణవులు, తగవులాడుకొని కోర్టుకు పోయిరట. ఇరువురి వాదనలు విన్న ఆంగ్లేయులు V Y కాక U యు మార్కునామము తీయమనిరట. అట్లేమహమ్మదీయులు టిప్పుసుల్తాను ఆలయధ్వంసము చేయుటకు వచ్చినపుడు మీ బీబీ ఉన్నదని ముప్పును తప్పించిరట లేకపోతే వెంకటేశ్వరునికి బీబీ ఎందులకు? ఉన్న ఇద్దరు చాలరా? ఈ మతసామరస్యమును సాధించుటకే తరువాతివారు చాలామంది కబీరు, సాయిబాబా (షిరిడి) సత్యసాయిబాబా (పుట్టపర్తి) వ్యాసాశ్రమాధిపతి మలయాళస్వామిగారు సర్వమత చిహ్నములను తెలుపు ముద్రికలను వేయించిరి. అంతెందుకు గీతలోనే

"యోయధామాంప్రపద్యంతే తాంతథైవ భజామ్యహమ్" అనియు యోయో యాంయాం తనుంభక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి తస్యతస్యాచలం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్" అనికలదు. ఏడవ అధ్యాయము 19వశ్లోకము ఎవరెవరేయేరూపాన్ని భక్తితోకొలిస్తే వారివారికాయారూపములందే శ్రద్ధగల్గించి కోర్కెలతీర్చెదనని అర్థము. ఏపేరుతో పిలిచిన ఏరూపముతో తలచిన భక్తి ప్రధానముగానీ వేష భాషలు ముఖ్యముగాదు. ఈ అర్థమునుతెలుపు పద్యమును యిచ్చుట పొందుపరచుచున్నాను.

సీ॥ శ్రీగననాయకా। శ్రీ భైరవేశ్వర
శ్రీవేంకటేశ్వర। శ్రీశఈశ
శ్రీరామ శ్రీకృష్ణ శ్రీనారసింహుడా
శ్రీఆంజనేయుడా శ్రీ కుమార
శ్రీరమా శ్రీ ఉమా శ్రీవాణీ శ్రీ చండి
ఎల్లమ్మ గౌరమ్మ మల్లమాంబ
అయ్యప్ప బయ్యన్న అల్లా జినా ఏసు
ఎవరు ఏపేరుతోనేమి యన్న

॥తే॥ అట్టి రూపాన వారల యాశదీర్తు
అన్నిరూపాలనంతట నున్ననన్ను
కొలిచినోరాల పిలిచిన పలుకువాడ
భక్తి నమ్మకముండిన ముక్తిగల్గు

విద్వాన్ రాయరె - 4-2-74

కొందరు మానవనిర్మితమైన రాల్లు ,బొమ్మలు, రంగు చిత్రములు, కొయ్యబొమ్మలు దేవుల్లుకారు. విగ్రహారాధన చేయరాదనియు అసలు దేవుడేలేడని (నాస్తికులు) వాదింతురు. ఎవరివిశ్వాసము వారిది. ఇంతవరకు నేనుచెప్పిన రహస్యము ప్రకారముకూడా అదేభావము కలుగునని మీరనుకొనవచ్చును. దేవుడొకడేయను భావమును నిరూ పించుటకే ఇట్లు చెప్పితిని.

"సర్వభూతస్థమాత్మానాం సర్వభూతానిచాత్మని
ఈక్షతేయోగ యుక్తాత్మా సర్వత్రసమదర్శనః

యోమాంపశ్శతి సర్వత్ర సర్వంచమయిపశ్యతి
తస్యాహం నప్రణస్యామి నచమేన ప్రణశ్యతి

మత్తఃపరతరం నాన్యత్కించిదస్తి ధనుంజయ
మయిసర్వమిదం ప్రోతంసూత్రేమణిగణాఇవ

సమోహం సర్వభూతేషు నమే ద్వేషోస్తిన ప్రియః
యేభజంతితు మాంభక్త్యామయితే తేషుచాప్యహం

అంతట అన్నిప్రాణులయందు నేనున్నాను. పంచభూతములయందు ప్రపంచమంతట రాల్లు చెట్లు ఒకటేమిటి ఇందు అందనక ఎందెందు చూచినా కలనన్నాడు. అటువంటప్పుడు ఏరూపమును పూజించినను ఆసర్వేశ్వరుని పూజిం చినట్లే. నిశ్చలత్వమును ఏకాగ్రతను సాధించుకొనుటకు ఒక రూపమును మనసున నిలుపుకొనవలెను.

"దేవేతీర్థేద్విజేమంత్రేదైవజ్ఞే  భే ష జే గు రౌ  యాదృశీభావనా యస్య సిద్ధిర్భవతి తాదృసీ దేవునియందు తీర్థమునందు బ్రాహ్మణునియందు మంత్రమునందు జ్యోతిష్కునియందు ఔషధమునందు గురువునందు విశ్వాసము,ఎట్టిభావముగలిగినవానికి అటువంటి ఫలితయుండును.

పంచభూతము లందున ప్రాణులందు
చెట్లచేమల గుట్టల పుట్టలందు
రాల్లరప్పలనెందైన నెల్లచోట
నిండియుందును నంతట నిందునందు     రాయరె.

ఈ భావమునే పోతన

||క||  ఇందుగలడందులేడని
సందేహమువలదు చక్రిసర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన
అందందేకలడు దానవాగ్రణివింటే

అన్నాడు. కాన రాతి విగ్రహములైన, చాయాచిత్రములైన, కొయ్యబొమ్మలైన పూజార్హములే కేవలము భక్తి విశ్వాసములున్న చాలును. ఇట్టివికల క్షేత్రములు కలవుకదా?

# క్షేత్రపాలన - చరిత్ర

ఉత్తర హిందూదేశము నందు అంగ, వంగ, బంగాళ, నేపాల, ఘూర్జర, పాంచాల దేశములున్నట్లు, దక్షిణ భారతమున కళింగ, తెలంగ, చోళ, వేంగి, పలనాడు, వెలనాడు, పాకనాడు, ములికినాడు మొదలగు నామములతో రాజ్యము లుండినవి. మోపూరు భైరవుని దేవాలయము పరిసరములనున్న శాసనములబట్టి చూడగా ఈ ప్రాంతము ములికినాటికి చెందినదని తోచును. గోదావరి ప్రాంతము ముళకనాడు తిలింగము అను నామములతో పిలువబడు చుండెను. ముళక ములికిగామారి ఉండును లేదా ప్రత్యేకమైన నామమే అయి ఉండును. ఈ దేవాలయ నిర్మాణ కాలమును గూర్చి ముందు చర్చించితిమి కదా! అశోకుడు కళింగమును జయించిన తరువాత భౌద్ధమత ప్రచార బాగుగా జరిగినది. ఆ కాలమున అమరావతి, ధాన్యకటకము ధరణికోట మొదలగు ప్రాంతములందు భౌద్ధస్థూపములు భౌద్ధారామములు నిర్మించిరి. ఆ సమయముననే ఇచ్చట భౌద్ధారామము (ఇప్పుడు విభూతి గుహగా పిలువబడునది.) నిర్మింపబడి యుండును. నందలూరు దగ్గరకూడ నీ బౌద్ధస్తూపము కలదు. అశోకుడు క్రీ స్తు పూ ర్వ ము రెండవ శతాబ్ధము వాడగుటచే ఇచ్చటనున్న భౌద్ధారామమునుబట్టి ఈ దేవాలయము కూడా అప్పటికే ఉండి ఉండును.అందుచే ఈఆలయ నిర్మాణకాలమును నిర్ణయింపజాలము అన్నాను. అశోకుని తరువాత శాతవాహనుల పాలనలోనుండవచ్చును.

• వారికాలము క్రీ.శ. 62వ ప్రాంతము. ఆ శాతవాహన చక్రవర్తి యజ్ఞశ్రీశాతకర్ణి క్రీ.శ. 128వ శతాబ్ధమువాడు దక్షిణ దేశమున భౌద్ధారామములతోపాటు వైదికమతమునుకూడా పునరుద్ధరించెను. శాతవాహనులఅనంతరముఇక్ష్వాకులపాలనలోనుండినది. ఇక్ష్వాకులు, పల్లవులు ఆంధ్ర దేశమును పాలించునపుడు ఈ ప్రాంతము కూడ వారి అధీనములోనుండినది. బుద్ధుడు విష్ణుదేవుని అవతారముగా లెక్కింపబడిన తరువాత భౌద్ధులతోపాటు హిందువులు కూడా ఆ స్థూపములను గౌరవింప సాగిరి. అందుచే నిచ్చటనే భౌద్ధారామముకూడా శిథిలముగాక ఉండినది. ఈ స్థూపము 20 సంవత్సరాలక్రింద గూడు ఆకారముగానుండినది. కాని దానిచరిత్ర తెలియనివారుదానిని విభూతిగుహయనియు, అదియోగులు,సిద్ధులు, స్నానమునకు ముఖమాలా నదిలోనికివచ్చుటకు గుహమార్గమనియు చెప్పుచుండగానేను చెవులారావిన్నాను. ఆస్థూపమును నాకన్నులారా చూచితిని అందుచేనింతగట్టిగా వ్రాయుచున్నాను.

క్రీ.శ. 6వ శతాబ్దమున కడప మండలమును చాళుక్యులు పాలించిరి. ఇప్పటి తెలంగాణము రాయలసీమలోని అధికభాగము వారి పాలనలో నుండినది. తరువాత రాయలసీమ నెల్లూరు కాంచీనగరము క్రీ.శ.770 నుండి 973 వరకు పల్లవుల వశములో నుండెను. మరల పశ్చిమ చాళుక్య క్రీ.శ 11వ శతాబ్దము వరకు చోళులు పాలించిరి. 1000వ శతాబ్దమున రేనాడు పొత్తపినాడు, పాకనాడు, ములికినాడు మనమోపూరువారి అధీనములోనుండెను.

12వ శతాబ్దము చివర కాకతీయ పాలనలో నుండెను. గండికోట ఖైఫీయతు (విజ్ఞాన సర్వస్వము 169మ పేజి) ననుసరించి 13వ శతాబ్ది చివరలో కాకతీయ రుద్రమదేవి సామంతుడు కాయస్థ అంబదేవుడు ముల్కినాడు, ఘండికోట, రేనాడు, సకిలి, పొత్తపి సీమలను వల్లూరు రాజధానిగా చేసుకొని పాలించెను. (అత్తిరాల శాసనము) త్రిపురాంతక శాసనములో ఆ ఘండికోట ఖండికోట మనోరథ పురముగా పేర్కొనబడినది.

అంబదేవుడుగిరిదుర్గమల్ల,జలదుర్గబడబానల వనదుర్గదావా నల, స్థలదుర్గసుంచూర్త, బిరుదములపొంది యుండెను. అంబదేవుడు ముందు రుద్రమదేవికి అనుకూలముగావుండి తిరుగుబాటు చేసెను. ప్రతాపరుద్రుని కాలములో క్రీ. శ. 1308 నుండి 1314వ సంవత్సరమువరకు సోమయలెంకచేత 1314 నుండి 1319 వరకు జుట్టయలెంక గోంకారెడ్డిచేత పాలింపబడినది.

కాకతీయుల అనంతరము విజయనగర రాజుల అధీనమయ్యెను. ఆకాలమున అదిముల్కినాడు,రేనాడుసీమలకు కేంద్రముగా ఉండినది. శా.శ. 1272 సావంణ యొడయలు ఉదయగిరిరాజ్యమునుపాలించు నపుడు చేసిన దానశాసనము ప్రకారము పులివెందుల భూమిలో ములికినాట చెరువు క్రింద 2 తోటల మడి ఇచ్చినట్లు ఆలయ ద్వారమునకుగల శాసమున్నది. కాన నీకాలము సరిపోవును.

శా.శ. 1231 నందన నామ సంవత్సర మాఘ బహుళ సప్తమినాడు బొగలదేవి బ్రహ్మదేవుని మనుమడు భైరవదేవాలయ ముఖమండపమును కట్టించినట్లు శాసనముగలదు వీని ఆధారముగ కొంత చరిత్ర తెలియుచున్నది.

శా.శ. 1347 విశ్వావసు సంవత్సర ఆశ్వీయుజ బహుళ 8 అష్టమి నాడు బుక్కరాయల కుమారుడు కుమారదేవరాయలు విజయనగరమును పాలించుచుండగా బొప్పదేవుని విరూపణ్ణ గారి కుమారుడు తిరుమల రాయనిగారు తిబ్బనాయనిచేత కట్టించిన గాలి గోపురము (పశ్చిమము నమన్నది) శాసనము ప్రకారము విజయనగరరాజ్య పాలనలో నున్నట్లు తెలియును.

కృష్ణదేవరాయల కాలములో గండికోట తిమ్మరుసయ్యకు అమరకముగా చెల్లి అతని కార్యకర్తయగు అన్నాజీ ఆధీనములో నుండినది. క్రీ.శ. 1526 లో మాత్రము గండికోట ముగ్గరికి చెల్లినట్లు అగుపడుచున్నది. గండికోట ప్రస్తుతము జమ్మలమడుగు తాలూకాలో నున్నది. రాయసం కొండమరుసయ్యగారి కుమారుడు అయ్యపరుసు 1452న అచ్యుతరాయలు విజయనగర సామ్రాజ్యము నేలునపుడు భైరవుని అంగరంగ వైభోగములకు 235 బంగారు వరహాలు దానము చేసినట్లు గల శాసనము ననుసరించి విజయనగర రాజుల పాలనలో నున్నట్లు తేట తెల్లమగును.

శా॥. శ॥. 1466 నిజక్రోధి నామ సంవత్సరమురము మాఘ శుద్ధ స ప్తమి సదా శివరాయలు విజయ నగర సామ్రాజ్యనేలుచుండగ నంద్యాల అవుచదేవమహారాజ పౌత్రులు నరసింగయదేవ మహారాజ పుత్రుడు తిమ్మయదేవమహారాజులు చేసిన దాన శాసనమునుబట్టి విజయ నగరరాజుల పాలనలోనే ఉన్నట్టు తోచును. మోపూరు గండికోటకు చెందినదైనందున గండికోట పరిపాలనే దీనికి చెందినది.

సదాశివరాయల మరణానంతరము గండి కోటను నంద్యాల నరసింహరాజు పాలించుచుండగ గోల్కొండ నవాబు కులీకుతుబ్‌షా యొక్క సేనాని అమీర్ ఉల్‌ముల్క్ గండికోటను ముట్టడించెను. మొదటి సారిగా గండికోట మహమ్మదీయుల వశమయ్యెను. కాని అచిర కాలములోనే వెంకటపతి రాయలు తిరిగి స్వాదీనము చేసుకొనెను. క్రీ.శ. 1597 మరల నంద్యాల రాజుల వశమయ్యెను. ఈ విషయము నంద్యాల రాజుల దాన శాశనము వలన తెలియును.

క్రీ.శ. 1641 - గండికోట మరల మహమ్మదీయుల వశమయ్యెను. తరువాత సిద్దవట్టం మట్లిరాజుల పాలనలో కొన్నాల్లు, కడప నవాబు పాలనలో కొన్నాల్లు ఉండినది. తరువాత మైసూరు నవాబుఅగు హైదరాలిచే 1777 లో గండి కోట ఆక్రమింపబడెను సిద్ధవటంకోటనుగూడ హైదరాలి లోబరచు కొనెను. 1790 లో ఆంగ్లేయులచే ఆక్రమింపబడెను. తరువాత మోపూరు ఆంగ్లేయుల పాలన లోనికి వచ్చినది. ఆంగ్లేయుల పాలనలో కొన్ని ఇనాములు రద్దుకావింపబడినవి.

కొన్ని ఇనాములకు పన్నులు రద్దుకూడ చేసినట్లు కూడ జోగులకు యిచ్చిన (యర్రాజోగి నాగాజోగి) పన్ను రెమిషన్ పత్రము ప్రకారము తెలియుచున్నది. తరువాత చరిత్ర నాకు తెలియదు జ్ఞాపకము వచ్చిన తరువాత చరిత్ర కొంత తెలిపెదను.

క్రీ. శ. 1942వ సంవత్సరమున శ్రీ చిద్గగనానందస్వామి (శిరాజుపల్లె, పూర్వనామము వెంకటరెడ్డి నాయన) ఇచ్చటికి వచ్చి ప్రకృతి సౌందర్యమును పరిసరములను దేవాలయమును పరిశీలించి ఇచ్చట మకాము వేసి ఆశ్రమమును నిర్మించిరి. భక్తుల సహకారముతో ఆశ్రమమును ప్రారంభించి కొండపైనొక పాఠశాలను నిర్మించిరి. ఆ పాఠశాల నిర్మాణమునకు కావలసిన రాళ్లు మోపూరు పాడువడిన గోడలనుండి సేకరించి కొండపేటుపై నిర్మించిరి.

దానికిమోపూరు గోడలనుండిరాళ్లను నేనుకూడ మోసితిని. ఆ ప్రాతీయులనే కొంతమందిని భక్తులను ప్రోగుచేసి రోజుకొకరు బిక్ష మెసగునట్లు ఏర్పాటు చేసిరి. కొండ మీద నిర్మించిన పాఠశాల యందు భగద్గీత పారాయణ భాగవత పఠనము జరుగుచుండెను. పరిసర గ్రామస్తులను భక్తులనుగా చేర్చుకొని వారికి సన్యాస మిచ్చిరి. వారిలో ముఖ్యులు సనందస్వామి. (సిద్దంరెడ్డిపల్లె) సేవానందులు (మెవిల్లచెరువు) అభయానందులు (కొంద్రెడ్డిపల్లె) ముఖ్యులు. ఆశ్రమాధి పత్యము ననందస్వామికి, పాఠశాల ఉపాధ్యాయులుగ అభయానందస్వామిని నియమించిరి. ఈ అభయానందస్వామి ఆంధ్రభాష యందు కొంతనైపుణ్యము సంపాదించి హిందీని కూడ అభ్యసించియుండిరి.

వారుమాకు హిందీనేర్పుచుండిరి దక్షిణ హిందీ ప్రచార సమితివారి ప్రాధమిక, మాధ్యమిక, రాష్ట్రభాష మొదలగు పరీక్షలకు మాకు తర్ఫీదు నిచ్చిరి. తరువాత ఆశ్రమమునకు కొంత భూమిని సేకరించి అచ్చట సనందస్వామిని నియమించి మరల వేరొక చోటికి పోయిరి. తరువాత నేను శ్రీ మలయాళస్వాములవారి వ్యాసాశ్రమమున చేరి అచ్చట స ం స్కృ త ము నభ్యసించితిని. అభయానందస్వామి మరల గృహస్థాశ్రమమున చేరిరి.

సనందస్వామి అచ్చట మోహనగిరి ఆశ్రమమున పాఠశాలను నెలకొల్పి కొన్నాళ్లు సక్రమముగ నడిపిరి. వ్యాసాశ్రమమున చదువుచు నేను అప్పడప్పుడు నల్లచెఱువుపల్లె కొండమీదికి పోవుచు పాఠశాల నిర్మాణమునకు తోడ్పడుచుంటిని. కొందురు భక్తులు చందాలు వేసుకొని క్రింద, ఆశ్రమమునకు ఎదురుగా పాఠశాలను నెలకొల్పిరి. మాధ్యమిక పాఠశాలగా స న ం ద స్వా ము వా రి అధిపత్యమున జరుగు చుండెను. ఇంతలో నేను తిరుపతి శ్రీ వెంకటేశ్వర ప్రాచ్యకళాశాలయందు విద్వాన్ ఎ (సంస్కృతము మరియు తెలుగు) చదివి మదరాసు విశ్వవిద్యాలయమునుండి ప్రాచ్యవిద్యాపట్టమును గైకొని, మొట్టమొదట సిద్ధవటం ఉన్నత పాఠశాల యందు తెలుగు పండితుడనుగా చేరి అచ్చట ఐదు సంవత్సరములు ఉపాధ్యాయ వృత్తి చేసి పులివెందుల ఉన్నత పాఠశాలకు మార్చబడితిని.

1958వ సంవత్సరమునుండి రెండు సంవత్సరములు అచ్చట పని చేసినపుడు నల్లచెఱువుపల్లె మాధ్యమిక పాఠశాల యాజమాన్యమునకు ఉపాధ్యాయులకు భేదాభిప్రాయములు వచ్చినవి. ఉపాధ్యాయులకు జీతములివ్వలేదని ఉపాధ్యాయులు మేనేజరు మాట వినలేదని తగవులు పడుచు పాఠశాలను మూసివేయు పరిస్థితియేర్పడినది. అపుడుమేనేజరు శ్రీ సనందస్వామి పాఠశాలను ప్రభుత్వము వారికిచ్చెదననిరి. ఆ సమయమున బసిరెడ్డిగారు జిల్లా పరిషదధ్యక్ష్యులుగా నుండగా, వేంపల్లె నాగిరెడ్డిగారి ద్వారా పాఠశాలను ప్రభుత్వము వారికి స్వాధీనము చేసిరి. త్రిమూర్తులవలెనున్న గ్రామస్తులు. బుడ్డారెడ్డి, పుల్లారెడ్డి, ఈశ్వరరెడ్డి మరి కొందరి సహకారముతో పాఠశాల ఆస్తులను భవనములను ప్రభుత్వమువారికి వ్రాయించిరి. తరువాత నేను 1961 సంవత్సరమున పులివెందుల నుండి నల్లచెరువుపల్లె పాఠశాలకు మార్చబడితిని. అచ్చట పాఠశాలను అభివృద్ధిచేయుచు విద్యార్థులతో చెట్లు నాటించి విద్యాబోధన చేయు సమయమున ఆపాఠశాల ఆస్తుల పాడుచేయువారితో తగవులు పడుచుంటిమి. పైన వేసిన ఆశ్రమము తలుపులు ద్వారబంధములు కిటికీలు బండల మొదలగునవి కడ్డీలు కూడ తీసుకొనిపోవుచుండిరి. ఎట్లో నలుబదియేండ్లు పోరాడి పాఠశాలను నడుపు కొంటిమి. ఆశ్రమములో స్వామిమరణించుట పాఠశాలకు కాపలాలేకపోవుట ప్రభుత్వము, ప్రజలు,

ఉపాధ్యాయులు, నిర్లిప్తముగా నుండుటచేత మరల పాఠశాలకు క్షీణదశ యేర్పడినది. దాతలు కట్టించిన రూములు పడిపోవుటకు మొదలిడినవి. దానికితోడు పాడుచేయువారు తోడ్పై దాతల పేర్లు గల శిలా ఫలకములను రోశిరెడ్డి, ననందస్వామి, కట్టించిన భవనముల పగలగొట్టిరి. ఎందుకిలా జరుగుచున్నది భగవంతుడా నీయేమి చేయుచున్నావని వేదనచెంది నేను వ్రాసిన పుస్తకములకు పీఠికలు వ్రాసి అందులో నీగుడి బడి చెడిపోవుట వ్రాసితిని. అట్లే ప్రచారము చేయుటకు పుస్తకములవ్రాసి ప్రకటించి కొందరకు ఉచితముగ నొసంగితిని. 1990లో చేసిన పుస్తక ప్రచురణ వల్ల చేసిన ప్రచారమువల్ల ఇప్పుడిప్పుడే మరల అభివృద్ధి జరుగు చున్నది. గుడి దగ్గరకు నీరు తెచ్చుట, విద్యుత్తు రోడ్లు, మొదలగునవి కొందరు భక్తులు ఏర్పాటు చేసిరి. కాని ఇప్పుడైన వానిని పాడుచేయక కాపాడుకొనవలెనని భక్తులకు, ప్రజలకు, అధికారులకు, పూజారులకు మనవి చేయుచున్నాను.

భైరవేశ్వరునే కాపాడుకొనుమని వ్రాసిన గేయమును ఇచ్చట సందర్భాను సారముగా వ్రాయుచున్నాను.

"యల్లారెడ్డి" గాయములలోని గేయము:–

జయ భైరవేశ్వర ! జయ భైరవేశ్వరా
జయ విజయ దిగ్విజయ జయ భైరవేశ్వరా!
మా దేవలంబు మహా దేవలంబు
మహాదేవ దేవ ఆత్మజా దేవలంబు

అభివృద్ధి గాకున్న నటుల పోవగనిమ్ము
శిధిలమై జీర్ణమై చెడిపోవు పడిపోవు.
ఏలనోకాలంబు కలసి వచ్చుట లేదు.
ఎందుకో ప్రజలలో భక్తి భావము రాదు.
మోపూరి గిరి ఝరీ మొగమూరు నదిదరీ
కలియు సన్నిధిబడి, కలదు భైరవగుడి.
జరజరా ప్రవహించు గిరిదరీ నిర్ఝరి
కలకలా మెలమెలా కదలు మొగమూరు
ఉద్దండముగా పారు ఉద్దండవాగున్ను
సంగమంబై యచట సంగమేశ్వరమేగు.
సూర్యచంద్రులొకింత సొలసి విశ్రాంతికై
మోహనాచలముపై వాహనంబులనిల్పి
కైలాస శిఖరాల కాలదన్నగ జాలు
గోపురంబులలోన రేపుమాపుంటారు.
మోపూరు కొండపై ముదముతోనున్నాడు
స్వయముగా వెలసిన స్వామి భైరవుడు.

ఆసామిదయతోడ నచటవెలసినశాల
కల్పవృక్షము మాకు కామధేనువుమాకు
దేవవిద్వజ్జనులు దేవర్షిబృందంబు
చిన్మయుడు సద్గురుడు చిద్గదబుషివరుడు
శ్రీసనందస్వామి శ్రీ అభయానంద
మరికొందరాయ నామహనీయశిష్యులు
దీవించినిలిపిన దివ్యవిద్యాలయము.

మాపాఠశాలయే మహాపాఠశాల
మరేపాఠశాలయు సరీసాటిరాదు.
ప్రకృతిసుందరమెందు, పరికించ, లేదు.
మాకొండపైనుండి మనుజుడెవ్వండైన
కనుగొన్నమాత్రాన కనుచూపుదూరాన
కదిరినరసింహుండు, గండిహనుమంతుండు
సంగమేశ్వరభవుడు సాక్షాత్కరించెదరు.
మూడూర్లనడుమున మోపూరుకొండపై
వల్లభరాయుండు వాల్లభ్యమొనరించె
క్రీడాభిరామంబు క్రీడించెనచ్చోట
శ్రీనాధుడొలకించె శృంగార భావాల
పీఠాధిపతి బృహత్పీఠమచ్చటనుండె
ఆకొండపైనుండి ఆలోకమునజేయ
ఊర్లు వాడలు యేర్లు పైర్లు పచ్చ పొలాలు
చెఱువులు కుంటలు చెట్లు చేమలు చేలు
అష్టదిక్కులలోని అందచందంబులు
ప్రకృతి సౌందర్యంబు ప్రత్యక్షమగుచుండు.
ప్రళయకాలమునాడు విలయతాండవమాడు
గగనచుంచితమైన గంభీరకాయుండు
మోహనగిరిపైన మోహంబు జనియింప
కాపురంబున్నాడు. కాలభైరవసామి.

హరిహరా భేదంబు అచ్చటనున్నదిగాన
శివకేశవులు గలరు చెరియొక్క చెంపన.
గణనాయకుడుగలడు క్రౌంచధారుడు గలడు
మాతమహిసాసుర మర్ధినీగలదచట
పెద్దబాగాదమ్మ చిన్నబాగాదమ్మ
భైరవేశ్వరస్వామి భామలిద్దరుగలరు.
పైకేగునప్పుడు ప్రక్కప్రక్కనున్న
అక్కపప్పూరమ్మ చక్కనైన పిన్ని
ముదుసలి మావయ్య మసలి గంగమ్మయు
ముందు పూజలు గొంచు మురిపెంబు చూపేరు
విక్రమంబునుజూపి విఖ్యాతి పొందిన
వీరుల ప్రతిమలు వరుసగానున్నవి.
గడ్డాలు మీసాలుగల యోగివర్యుల
సిద్ధులు సాధ్యులు శిలలు కూడాగలరు.
అమల బౌద్ధారామమానేలనొలకొనె
విమల విద్యాలయం వెలసె నచ్చోట
సర్వమత సహనంబు సామరస్యముకల్గె
ననుటకు మరికొన్ని యవశేషములు గల్గు
ఆకాశమును తాక నట్టుచాచువనాల
కుహుకుహూనినదానకోకిలలు చెలరేగ
ఒకవంక గోరువంక ఓరచూపులచూడ
చిలకలొకకెలనను సిగ్గుతో తలవంచ
ఉగుతబుడుతలు వేగ ఉరుకుచుండుటచూచి
హోయి హోయియటంచునానందముప్పొంగు.

ప్రాకారములు తమ ఆకారములువీడ
గుడులు గోపరములు మడులు మాన్యాలు
పడిపోవ చెడిపోవ పట్టించుకోరేల
రండి తమ్ములార? లెండి చెల్లెల్లార?
పరదేశముననున్న పరము భక్తుల్లార!
యువతరము వారైన ఉరకండిరారండి,
మార్కండమునివోలె మాగుడులు బడులు
కాలభైరవనిన్ను కౌగలించుకొనంగ
కాలుడెవ్వండైన కదలింపజూచిన
వాని ప్రాణముతోడ పోనీకు భైరవ?
నీతోడవరమంది నిన్నునాశముచేయు
భస్మాసురలనెల్ల భస్మంబుచేయుటకు
మీచేతకాకున్న మాచేతనగునయ్య
మురహరునితోనైన మొరపెట్టుకొంటాము
తరిమిభస్మాసురుల తలపగులకొడుతాము
"నినునీవు కాపాడుకొనలేని మనలేని
దేవుడవుమమ్మేమి కావగలవాడవని"
ప్రజలెల్లగుమిగూడి పలువిధంబులుగాగ
ఎకసెక్కెమాడేరు ఎగతాలిచేసేరు
ఉద్ధరించుకొనంగ శ్రద్ధగాయికనైన
లేవయ్యలేవయ్య దేవయ్యబయ్యన్న
కనులుతెరువుముసామి కాలభైరవదేవ
జయభైరవేశ్వరా జయభైరవేశ్వరా
జయవిజయ దిగ్విజయ జయభైరవేశ్వర!

ఈ గేయమునందు అచ్చట గల విశేషములను విశదముగా తెలిపితిని. పోయి చూచిన వారికివి గో చ రిం చు ను. మానవయత్నముచేసి తరువాత దేవునిమీద భారము వేయవలెకాని ప్రయత్నము చేయకనే పనులు నెరవేరవు. ఈ ప్రాంతమును అభివృద్ధి చేయవలెనన్న ముందుగా ప్రయాణ సౌకర్యములు కావలెను. అందుచే 15 ఊర్ల ప్రజలచే చేవ్రాలు చేయించి ఇచ్చుటికి ప్రయాణ సౌకర్యములకు రోడ్లు వేయించమని వేంపల్లె నాగిరెడ్డిగారు సమితి ప్రసిడెంటుగా నుండగా డి.యన్.రెడ్డిగారు పరిషత్ అధ్యక్షులుగా నుండగా వినతి పత్రములు సమర్పించితిమి. అప్పుడు కొన్నిరోడ్లు వేయించినారు. పాలగి శ్రీరామిరెడ్డిగారు భైరవసాగరమునకు కొలతలువేయించి పనిమొదలు పెట్టునప్పుడు ప్రజలు ముంపు జరుగునని నిలిపివేయించినారు. భైరవసాగరము నిర్మించి యుండిన ఈ ప్రాంతములో నీటి కొరత యేర్పడి యుండెడిదికాదు. అట్లే పాడుపడిన వానిని పునరుద్ధరించుటకై కవితలు వ్రాసి ప్రచారముచేసి 12 లక్షల పని సాధించుకొనగా నదియు నిలిచిపోయినది. అవన్నియు ఇప్పుడు కొన్నినెరవేరుచున్నవి

"ఉద్యమేనహి సిధ్యంతికార్యాణి నమనోరథైః"
నహిసుప్తస్యసింహస్య ప్రవిశంతి ముఖేమృగాః

అనగా ప్రయత్నము తోనే పనులు నెరవేరును కాని కోరికలు కోరి నంతనే నెరవేరవు. నిద్రించు సింహము ముఖములో మృగములు ప్రవేసింపవు, అనిసూక్తి, అటులనే మనమందరము

ప్రయత్నించి నెరవేర్చుకొనవలెను కత్తులతోచేయరానివి కలములతో సాధింపవచ్చును నేను నాకలమును కదలించినాడను. కొంతవరకు ఫలితము దక్కినది ఇంకను అభివృద్ధికావలెనని కాంక్షించుచున్నాను. ఇందుకు ముందు తరమువారు పూనుకొనవలెను. ముఖ్యముగా అచ్చట చదువుకొని పైకివచ్చినవారు అధికారులు ఆ కార్యములకు పూనుకొనవలెను. భాషావిషయముగా నైపుణ్యముసాధించి నేను సాహిత్యపరముగా అభివృద్ధికి పాటుపడితిని. అట్లే క్రిష్ణంగారిపల్లె రోశిరెడ్డిగారు కొంతవరకు ఆర్థికముగా అభివృద్ధికి పాటుపడుచు, విద్యుత్తువేయించి, ఒక గదిని నిర్మించిరి. ఇంకను చేయగలరని ఆసించెదము. ఎవరెవరేవిధమై అభివృద్ధిచేసినది నాకుతెలియదుకాన వారినిచ్చట పేర్కొనలేదు. నల్లచెర్వుపల్లెరామిరెడ్డి శిద్దారెడ్డిగారు అక్కపప్పూరమ్మ దేవాలయము రిపేరు గావించిరి. రామిరెడ్డి గంగిరెడ్డిగారుముసలి గంగమ్మ గుడికట్టించిరి. ఇంకను కొందరు అభివృద్ధికి సహకరించి గుప్తదానములు చేసినవారు కొందరుకలరు వారు ఎంతెంత దా న ము చేసినది వారెవరైనది నాకు తెలియనందున వారిని కూడా పేర్కొనలేదు. వారుస్వయముగా వచ్చితెలిపినచో పునర్ముద్రణమున వారిపేర్లను కూడా తెలుపవచ్చును. గుప్తదానము చేసినవారు పేరు ప్రతిష్ఠలకు ప్రాకులాడనివారు కలరు వారినందరిని భైరవేశ్వరుడు కాపాడుగాక.





వినుకొండ వల్లభరాయుడు :– క్రీడాభిరామము:–

మూడుగ్రామగ్రాసములతోడ  కూడంగ
మోపూరుపాలించె ముల్కినాట
అశ్వలాయనశాఖయందు ఋగ్వేదంబు
కరతలామలకంబుగా పఠించె
ప్రత్యక్షమొనరించి భైరవస్వామిచే
సిద్ధ సారస్వత శ్రీవరించె
కామకాయన విశ్వామిత్రగోత్రంబు
వంశగోత్రంబుగా వార్తకెక్కె
॥తే॥ ఎవ్వడాత్రిపురింతకాధీశ్వరునకు
రాయనవరత్నభండార రక్షకునకు
ప్రియతనూజుండు చంద్రమాంచికకుసుతుడు
మనుజమాత్రుండెవల్లభామాత్యవరుడు.

“అభ్రధునీ, లహరీ భ్రమఘుమఘుమలు మహిదిప్పవల్లభన్నవాగ్వైభముల్”
చాటుకవితాపాటవమమరునవనివల్లభన్నకు నమరున్
“సురభులు తిప్పయవల్లభరాజప్రధానవాగ్వైభవముల్”
“భ్రమియించు తిప్పసచివోత్తమువల్లభవిభునిచాటుధారాఘణతుల్”

కం॥ నల్లచెరువు తూముకాలువ
హల్లకముల కమ్మదావినపలాపించున్
సల్లలితలీలదిప్పయ
వల్లభరాయప్రధాన వాగ్డంబరముల్
“వితీర్ణప్రౌఢిన్” అంటే దానగుణమందు:–

||క|| సరివత్తురీవి నిర్ఝర
పరివృఢఢణి, దనద, జలద, బలి, ఖచర, నిశా,
కర, సురతరు, సురధేనువు,
లరుదైత్రిపురారి వల్లభామాత్యునకున్.

వినుకొండ వల్లభరాయుడు తానురచించిన క్రీడాభిరామమునందు కృతి కర్త ప్రసంసను ఇట్లు గావించుకొనెను నల్లచెరువుపల్లె, కొండ్రెడ్డిపల్లె, నారేపల్లె, మూడు గ్రామములతో మోపూరులపాలించెననియు,ఋగ్వేదంపఠించెననియు భైరవస్వామిని ప్రత్యక్షము చేసుకొని సారస్వత శ్రీని పొందెననియు, విశ్వామిత్ర గోత్రమున జన్మించినవారనియు, చెప్పుకొనెను. కవితా ధారనుగూర్చి చాటుధారను గూర్చి, వాగ్వైభవమునుగూర్చి , ఆకాశగంగా ప్రవాహమువలె నల్లచెఱువుపల్లె తూము కాలువవలె కవితా ప్రవాహము కలవాడనియు చెప్పుకొనెను. నల్లచెఱువుకు బదులు, నెల్లూరు అని సవరించియుండవచ్చును. నెల్లూరు మోపూరుకు సబంధమేలేదు. “నల్లచెర్వు” దగ్గరనే ఉన్నది దాని తూము శబ్దము ఝుమ్మను ప్రవాహనాదము వినిపించును. ఆచెఱువు పేరే ఆఊరికి వచ్చినది. దీనిని బట్టి చూడగా 500 యేండ్లకు మునిపే ఆచెఱువు ఊరుఉన్నట్లు తోచును.నన్నయ్య,తిక్కన, సోమన భాస్కరులవలె కవిత వ్రాయగలవాడనియు చెప్పుకొన్నాడు. దాన గుణమునందు బలి, చంద్ర, కల్పతరు, కామధేనువుతో సమానుడనియు చెప్పుకొన్నాడు. ఇదంతయునా భైరవ దేవుని దయయనియు ఆదేవుడే ఈతని కోరికల తీర్చుననియు చెప్పుకొన్నాడు.

||తే|| విశ్వవిశ్వంబు పాలించు విభునిచేత
పార్వతీదేవి గారాబుపట్టి చేత
ఈప్సితముగాంచు తిప్పమంత్రీంద్ర తనయు
డార్యమణి వల్లభామాత్యుడహరహంబు.

తననుగూర్చి సగర్వముగా చెప్పుకొన్నను తుదకంతయు నాభైరవుని దయ అని భారమంతా దేవుని పైనవేసినాడు.

||చ|| ముదమున ముల్కినాటిపురమోహన శైలసువర్ణకందరా
సదనుడు కాలభైరవుడు శంభుని పట్టి సమగ్ర వైభవా
భ్యుదయపరంపరావిభవముల్ కృపజేయు కవీంద్రకాంక్షిత
త్రదశమహీరుహంబునకు తప్పయ వల్లభరాయ మంత్రికి

ఈ పద్యమునందు కూడ భైరవుడను గ్రహించునన్నాడు. పైగా కవులకు కోర్కెలు దీర్చు కల్పవృక్షమట, తాను కవియేగాక కవులను పోషించుచున్నట్లు తెలియుచున్నది.





క్రీడాభిరాములోని కృతికర్త వంశవర్ణననుబట్టి ఇట్లు తెలియుచున్నది.




ఈ వంశమువారిలో తిప్పన్నలు నలుగురున్నారు. మోపూరు కొండను మోపూరు తిప్ప, అని అందురు. అందుచే తిప్పన్న పేర్లు వచ్చి ఉండును.

వినుగొండ వల్లభరాయుడు 14వ శతాబ్దము వాడు శ్రీనాధుని సమకాలికుడు అందుచే క్రీడాభిరామకర్త శ్రీనాధుడను వాదముగలదు. దానినిగూర్చి ముందు వివరించెదను. వినుకొండ వల్లభురాయునికి ముందే ఇచ్చట కవులు, గాయకులు, నటులు, విటులు, ఉన్నల్లు క్రీడాభి రాములోని ఈ పద్యము వలన తెలియుచున్నది.

||క|| నటులది దోరసముద్రము
విటులది యోర్గల్లు కవిది వినుగొండ మహో
పుట భేదనమీత్రితయము
నిటకూర్చెను బ్రహ్మరసికులెల్లను మెచ్చన్.

అశేష విద్వ్యజ్జనులున్నట్లు దాన శాసనము వలన తెలియుచున్నది. వల్లభరాయునికి ముందు రావిపాటి త్రపురాంతక దేవుండను కవీశ్వరుడు "ప్రే మా భి రా మ ను" నాటకము రచించియుండెను. దానికితెనుగు అనువాదమును క్రీడాభిరామమను పేరుతోనీతడు రచించెను. భైరవుని తిరునాల్లు రధోత్సవములు జరుగునపుడు ఈ వీధి నాటకమును ప్రదర్శించుటకై రచించి ఉండెను.

భైరవుని తిరునాల్లు బాగుగా జరుగుచుండెను. నాటకాలు, కోలాటలు, చెక్కభజనలు, బుర్రకథలు, పండిరి భజనలు, వేయుచుండుగా భైరవునిఊరేగింపు వాహనములపైజరుగుచుండెను.

ముఖ్యముగా నందివాహనము ఆనందోత్సాహములతో చేయుదురు. మోపూరు కొండ మీదనుండి నల్లచెఱువుపల్లెకు పల్లకీలో ఊరేగింపుగాకొని వచ్చెదరు. దానికి ప్రత్యేకముగా బోయీలుగా తలవరులనియమింపబడిననుఅన్నివర్ణములవారుమోయు చుందురు. కడపట సిడిబండినిమూడుఊర్ల వారు కట్టుచుండిరి. ఈ సిడి బండిని ముతుకూరు జోగిరెడ్డి వంశమువారు చేయించిరట. సిడిబండికి కట్టు ఎద్దులను బాగుగా మేపి గజ్జలు, మువ్వలు, తలతాళ్లు, బొడ్డు వార్లు వేసి బాగుగా అలంకరించి ఈ డ్చ్పిం చ ద రు. ఆబోతులఅందచందముల చూచి తీరవలెను. ఇప్పుడు తిరుణాల్లు, తేరులు ఊరేగింపులు ఏవి లేవు.

వల్లభరాయుని కాలము క్రీ. శ. 1475వ శతాబ్దము విజయనగర సామ్రాజ్యమును ప్రౌఢదేవరాయులు పాలించునప్పుడు రాయ నవరత్న భండార రక్షకుడుగా నుండెను. అతని ఆస్థానమున గౌడ డిండిమభట్టు కవి సార్వభౌమ బిరుదాంకితుడై కంచుఢక్కగలిగి ఉండును. ఆ సమయమున శ్రీనాధుడు కొండవీటి రెడ్డిరాజుల అస్థాన కవి గాను వి ద్యా నా ధు డు గా నుండెను. అతనికి గౌడడిండిమభట్టును వోడించి కంచు ఢక్కను పగలగొట్టించవలెనను కోర్కె ప్రబలముగా నుండెను. వల్లభరాయుని పూర్వీకులు విజయనగరరాజుల నాశ్రయించి ఉన్నత పదవులనొందియుండిరి. తిప్పయామాత్యుని తండ్రియగు త్రిపురాంతకుడు వీరహరిహరరాయ "పృధ్వీకళత్రరతభండార సాధికారప్రగల్భుడు" తిప్పయ దేవరాయల కత్నభండార రక్షకుడు.

తాతయగు త్రిపురాంతకుడు శ్రుతపర్వత దుర్గమహా ప్రధానరాట్ గంధగజంబు. అనగా వినుగొండ దుర్గాధిపతికి కుడిభుజము. ఈ విషయము క్రీడాభిరాములలోని వంశ చరితవలన తెలియుచున్నది. వినుగొండ దండనాథుడుగానున్న వల్లభరాయుని సహాయమున విజయనగరరాజుల ఆస్థానప్రవేశము చేసి వాదమున డిండిభట్టునోడించి అతని కంచుఢక్కను పగుల గొట్టించి కవిసార్వభౌమ బిరుదమును పొంది, కనకాభిషేకంగా వించుకొనెను. తరువాత శ్రీనాధుడును రాజమహేంద్ర వరమును పాలించిన వీరభద్రారెడ్డి ఆస్థానమున నుండెను. క్రీడాభిరామము శ్రీనాధకృతమనియు వల్లభరాయుని కృతముకాదనియు నొకవాదవు గలదు వల్లభరాయుడు తన కవిత్వ పాటవమునుగూర్చిచెప్పుకొనుట చూడగా అతనికి కవిత వ్రాయు పాటవము లేదని చెప్పుట అసంగతము. వినుకొండ కొండవీడు రాజులకు అండగానుండి యుద్ధములు చేసిన వీరవరుల విగ్రహములుకూడనీకొండపైగలవని చెప్పితిని.

క్రీభిరామరచన విషయమేకాదు. ఇంకా ఎన్నో గ్రంథముల రచయితలగూర్చి వాద వివాదములు గలవు.కృ ష్ణ దే వ రా య లు "ఆముక్తమాల్యదను గూర్చి గూడ నిట్టదే కలదు" పెద్దనవ్రాసి కృష్ణదేవరాయ పేరుపెట్టెనని అందురు. కవి పండితుడు కానిచో కృష్ణదేవరాయులు కవులను పోషించియుండడు.

వల్లభరాయుని తాత త్రిపురాంతకుడు వినుకొండలో ప్రసిద్ధపురుషుడైయుండును. అందుచే వినుకొండ అను యింటిపేరు

ఈ వంశమునకు వచ్చి ఉండును. త్రిపురాంతకునకు ముందు ఈ ప్రాంతము కాకతీయుల పరిపాలనలో ఉన్నదనిచెప్పితిని. అందుచే నతని ప్రేమాభిరామమునందు కాకతీయులవైభవముఏకశిలానగరము (వరంగల్లు) వర్ణన అచ్చటి వింతలు వినోదములు సంస్కృతమున వ్రాసియుండెను. దాని అనువాదముగాన అట్టి వర్ణననే చేసిఉన్నాడు. అంత కవి పండితుడైనవాడే చిన్న పొత్తమునసువదింపలేడా? అదీకాక వల్లభరాయుడు ఉపయోగించిన కొన్ని తిట్టుమాటలు ప్రాంతీయ పదములు ఇప్పటికిని ఇచ్చట ఉపయోగింపబడుచున్నవి.

ఉదాహరణ:- మిండెగాడు, లంజముండ, ముండలంజ, లంజకొడుకు, లంజకాడు మొదలగునవి కలవు. ఇక గూబలంటు, బెదరిపోవు, లంజదానింట,చొక్కపుజోగి భైరవతంత్రము. ఎకసక్కెము, ముండకొడుకు, మాసకొమ్మ, మూలిగి మాలిగి, తిండితినినాడు కిట్టుచెప్పులు, తప్పెట్లు, తాలాలు, గొంతుకూర్చును, దుద్దుకమ్మలు, ముత్యాల కమ్మలు, నేతితోపెరుగుతో, కుమిలి కుమిలి, కాముక, దిమ్ముతిరుగు,డంబరాలు మొదలగు పదములనెక్కువగ ఉపయోగించి యున్నాడు. ఈ పదములు ఇప్పుడుగూడనిచ్చట వాడుకలోనున్నవి.

ఎల్లారెడ్డి గాయములలోని పీఠికలోనీ విషయమును చర్చింతిమి. అచ్చటనావిషయమునుగూడ నుడివితిని. రామిరెడ్డి యల్లారెడ్డి,అనుపేరును తెలగు పూర్వాక్షరములతో "రాయరె" అనుపేరు పెట్టుకొంటిని.

నేనువ్రాసి పుస్తకములకు 1. యల్లారెడ్డి గాయాలు 2. యల్లారెడ్డి సూక్తి చతుశ్శతి, 3. అభినవాంధ్ర బిల్హణీయము 4. ఆధునికాంధ్ర మేఘదూతము,5.ఎల్లారెడ్డి రూపకములు మొదలగువానికి"రచయిత" విద్వాన్ రాయరె, అని వ్రాసితిని.మున్ముందు ఎల్లారెడ్డి పేరు రాయరె వేరను వాదముకూడ వచ్చునేమో అను సంశయము ప్రకటించితిని. నేను చదువుకొను చిన్నవయస్సులోనే ఆంగ్లపుటాక్షరములకు బదులు (R.Y.R.) రాయరె అని వ్రాసికొంటిని. ఇది ఎవరి అనుకరణకాదు. ఆంధ్రముపై అభిమానముతోనట్లు వ్రాసుకొంటిని.

## క్రీడాభిరామము : కథావస్తువు.

వినుకొండ వల్లభరాయుడు రచించిన క్రీడాభిరామము తన తాతయగు త్రిపురాంతకుడు రచించిన ప్రేమాభిరామమను సంస్కృత గ్రంథమునకు తెనుగు అనువాదము ఈ ప్రేమాభిరామము. ఇప్పుడు కానరాదు క్రీడాభిరామము 1475లో వ్రాయబడినది. ఇది ధూర్తవిట చారిత్రము.ఏకశిలానగరములోని ఆర్యవాటికయందు"కామమంజరి" అనువేశ్య ఉండెను. ఆమెయందు బద్ధానురాగుడైన కాసన్నాటి గోవిందశర్మ మిత్రుడగు తిట్టిభశెట్టి వేరు పనిమీద దేశాంతరమేగి యుండిరి. కార్యము పూర్తిచేసికొని మరలా కామంజరిని కలసు కొనుటకు ఏకశిలానగరమునకు ప్రయాణమైరి. ఏకశిలానగరమున రాజమార్గమునగాక సందుగొందుల బడిపోవుచు వారవనితల, కోడికూతల, సూర్యోదయముల, మేదరవాడల, తిలకించుచు,

చండాలాంగన, కర్ణాటాంగనల, పామరభామల, కరణ కాంతను, ఈరీర్చుట, పసుపు నూరుట, మొదలగువానిని అసభ్యముగా వర్ణించెదరు. ఓరుగల్లు పల్నాటి వీరుల, ఏకవీర, బవనీడు,మాలెత, కాపుటాలు, జిక్కులపురంధ్రి అక్కలు, మైలారభటులు, భైరవుడు, పూటకూటి యిల్లు, అచ్చుట వంటలు, మాచల్దేవి, చిత్రశాల, శ్రీకాకులపు తిరుణాల్లు, బ్రాహ్మణ వితంతువులు, నాగస్వరము, పాములాట, మేషయుద్ధము, కోడిపందెము, మధుమావతియిల్లు, మదాలస, బంతులాట, జారధర్మాసనము, సుసరబేత్తనుమందు మొదలగునవి వర్ణించుచుపోయిరి చివరకుకామమంజరినిసమీపించి మంచనశర్మ త న రా క ను నొక తంబల్లసానిచే రహస్యముగా మిండకత్తెకుచెప్పి కామమంజరికెరిగించెను. ఆమెను తాను విడిది చేసిన పూజారిసాని ఇంటికి రప్పించుకొనెను. కొంతడబ్బుయిచ్చి తమ్మటిసానిని తిట్టిభశెట్టికి గూర్చి నారేయి వినోదమున తేలిరి. ఇందులో కథావస్తువు లేకున్నను ఆనాటి ఓరుగల్లు వైభవము తెలియును. ఇట్టి అసభ్యశృంగార వర్ణన శ్రీనాధుడు చేసివుండడు వల్లభరాయుడు చేసివుండుడు ఎందుకనగానాతడు భైరవ భక్తుడు, త్రిపురాంతకుని ప్రేమాభిరామమునకు అనువాదము కాన తప్పక చేయవలసివచ్చి చేసెను.

నేనుకూడ శృంగార గ్రంధములగు బిల్హణీయము, మేఘసందేశము, అనువదించితిని, కానినేనట్టివాడనని భ్రమపడకుడు, నా స్వతంత్ర గ్రంధములను చూచిన నానీతి నిజాయితని గుర్తింప గలరు.

ఇంకోవిషయము వల్లభరాయుడు భైరవవరప్రసాద సారస్వత సిద్ధిపొందినవాడని చెప్పబడినది. ఇంకను అతని తాతముత్తాతలు కవిపండితులు. తరువాతకూడా అచ్చట అశేష దేవవిద్వజ్జను లుండినట్లు క్రీడాభిరామములన విజయనగర రాజశాసనములన తెలియుచున్నది. తరువాత ఇచ్చట పండితులుండిరోలేదో తెలియదు. ఉండినను వారి కాదరాభిమానములు లభించి ఉండవు. ఇప్పుడు కూడనట్లే ఉన్నది. రాజపోషన ప్రజాదరణలేదు. కవులు వ్రాసిన కావ్యములను తామే ముద్రించుకొని అమ్ముకొనవలసిన దౌర్భాగ్యము గలదు. కాన నెవరు ఉండినది తెలియదు. ఇచ్చట నేనువ్రాసిన పద్యమును వ్రాసెదను.

॥సీ॥ కల్పాలత దుర్దాంత కలుష ఘోరాకార
దావాగ్నికీలలదాటవచ్చు
ప్రళయకాలాభీల ప్రస్ఫుట బడబాగ్ని
కాలూది యవలీల నిలువవచ్చు
తీవ్రకోపావేశధీర భూధరనాగ
రాజేంద్రమును పట్టిలాగవచ్చు
విశ్వవిశ్వంభరా వేలమాలాతీత
జలనిధిలోదూకి తేలవచ్చు

॥తే॥ చేరిప్రతిపక్ష పక్షవిచ్ఛేదదక్ష
వస్యశాశ్విత వాగ్దేవి వైభవాప్త
పాండితీకవితావిభ వాఢ్యులైన
దేవవిద్వజ్జనులగెల్వ నెవరితరము

విద్వాన్..... రాయరె.

కృష్ణదేవరాయలు చెప్పినట్లు ప్రచారములో నున్న "దేశభాషలందు తెలుగులెస్స" అను నానుడి 14 వ శతాబ్దమున వ్రాయబడిన క్రీడాభిరామమున ముందే ఉన్నది చూడుడు.

||గీ|| జనని సంస్కృతంబు సర్వభాషలకును
దేశభాషలందు తెలుగులెస్స
జగతి తల్లికంటే సౌభాగ్య సంపద
మెచ్చుటాడబిడ్డ మేలుగాదె.

భైరవాలయమునకు సంబంధించిన శాసనముల వలన వినుగొండ వల్లభరాయుని క్రీడాభిరామ పుస్తకము వలన, నేను చేసిన పరిశోధనవలన, తెలియవచ్చిన విషయములను వివరముగా వ్రాసితిని.

## భైరవునికిగల భూములు

కడప జిల్లా పులివెందుల తాలూక వేముల మండలము నల్లచెఱువుపల్లె గ్రామ పంచాయితికి చెందిన మోపూరు భైరవునకు చుట్టుప్రక్కలగల కొన్ని గ్రామములలోని భూముల వివరముల కొన్ని నాకు తెలిసినవి తెలిపెదను. నల్లచెఱువుపల్లెలో 128,150,517, 64,616,69, సర్వేనెంబర్లుగల భూములు దాదాపు 80 ఎకరములు గలవు. నల్లచెఱువుపల్లె చెఱువుక్రింద వరిమడి కలదు.

పెండ్లూరు గ్రామమున 69వ సర్వే నెంబరుగల భూమి కలదు. గొల్లలగూడూరులో16. 1/2వ సర్వే నెంబరు,కొత్తపల్లె పంచాయితిలో 15/2, 412, 426, 432, సర్వే నెంబర్లు గల భూములుగలవు.

గొందిపల్లె గ్రామములో 618,207, 378,500, సర్వేనెంబర్లుగల భూములుగలవు. చాగలేరులో 412, 416, 432 సర్వే నెంబర్లు గల భూములు కలవు. ఇంకను ముతుకూరు, బలపనూరు మొదలగుపల్లెలలోఉన్నట్లు తెలియుచున్నవిరెవిన్యూ రికార్డుచూచినచో వివరములు తెలియును. అనంతపురము జిల్లాలోను, బళ్లారి జిల్లాలోను కర్ణాటకరాష్ట్రమందుకూడా కలవు. ఇవన్నియు ఎవరను భవించుకొనుచున్నారుగుత్తలుఎవరు తీసుకొనుచున్నారో వివరములు తెలుసుకొనవలెను.

ఇచ్చటహిందువులకుసంబంధించినఅన్నిదేవుల్లవిగ్రహములున్నను, మహమ్మదీయులకు సంబంధించిన మసీదులులేవు. గండికోట యందు కలవు. మహమ్మదీయ పాలనలో విజయ నగర రాజ్యపతనానంతరయు కొన్ని దేవాలయములు మసీదులుగా మార్చినారు. లేదావాని ప్రక్కన మసీదులను నిర్మించి ఉన్నారు. ఇచ్చట అది మాత్రము జరగలేదు. బహుశా మారుమూల నున్నందున ఇచ్చట జరిగి ఉండదు మ హ మ్మ దీ యు లు వారిమతమును ఆంగ్గేయులువారి మతమును, ఉద్ధరించుకొనుటకు హైందవ పేదలకు ఆశలు చూపి మత మార్పిడిలను చేసినట్లు తోచుచున్నది. ప్రస్తుతము ఈ మతముల మధ్య విభేదము వినాశమునకు దారి యేర్పడినది.

మతములగూర్చి వివరముగా. వ్రాయవలెన్న మరియొక్క పుస్తకమగును. అందుచే సూక్ష్మముగా వివరించెదను. వాని నామములు పేర్కొనకున్నను చదువరులు గ్రహింపగలరని భావించెదను.

మానవ జాతినే, పేర్కొని అందు పురుషజాతికే ప్రాధాన్యమిచ్చు మతము, స్త్రీ, పురుష సమాన భావముగల మతము, మానవులతోపాటు తక్కిన ప్రాణులను సమానముగా చూచు మతము, వారికిగల ప్రత్యేక గ్రంధములను ఎంతగా పరిశోధించినను ఒకరినొకరు ద్వేషించుకొనరాదను భావము తోచును. ప్రస్తుతము కొందరు మతోన్మాదులు పరమత ద్వేషమును బూని హత్యలగావించుచున్నారు. దానికి కొంత శాంతి గలిగించుటకు వ్రాసిన నా గాయములోని మతము అను గేయమును వ్రాయుచున్నారు.

**:- మతము :-**

మతము అంటే అభిమతమే

ఏకులమున – ఏమతమున పుట్టియున్న, గిట్టువఱకు
అవేవారి కులమతముల? అవేవారి అభిమతముల?
కాదుకాదు – వాదువలదు ఎవరికేది యిష్టమైన
ఎవరి జాతి – ఎవరి కులము ఎవరి మతము ఏదైనా
అందరకును – నభిమతముగ నడుచుకొనుచు నరులెల్లరు
సర్వసంఘ సంక్షేమము సకల ప్రాణి సమభావము
కలుగునటుల మెలగవలెను.
మతములన్ని మానవులకు మనుగడకై నడవడికను
పొడసూపెడు పోతలగును.
సంసారము సాగించెడు – దరికానని నరులకెల్ల
మోక్షమార్గమునుజూపే – దారులగును వేరుగాదు

ఈసు యేసు కృష్ణక్రీస్తు రామ్‌రహీమ్ యేమన్నను
నామరూప సమముగాదు - దేవుడొకడె జీవుడొకడె!
మతాచార్య మహాఋషులు - మహావీర మహమ్మదులు
బుద్ధ క్రీస్తు - నానకులును - ఏవేలకు - ఏవితగునో
ఆవేలకు అవి చెప్పిరి. కాలంబున కనుగుణముగ
మంచిగోరి మానవులకు - నియమంబుల నేర్పరచిరి.
గతములోన మతపెద్దలు చెప్పినవే గొప్పవనుచు
అవే యెల్లకాలంబును - ఆచరించవలెనంచును
మా దేవుడే గొప్పవాడు - మా మతమే గొప్పదనెడు
వాదమేల భేదమేల? ఐకమత్యమగును మతము.
వేషమేది వేసికొన్న - భాషయేది పలుకుచున్న
భావసుద్ధి ప్రధానంబు - మనసు మంచిదైనప్పుడె
మతము మంచిదగును కదా?
ఆహారము, ఆచారము - వేషభాషవేరైనా
అన్నిమతంబుల వారికి - ఆకారము ఒక్కటికద?
మగవారొక తెగవారే - ఆడవారుకూడా నొకటె
అంగభంగ మగుపించదు - లింగభేదమైనలేదు
కేశంబులు మీసంబులు - గడ్డాలును కలవుగదా?
కేశాలను మీసాలను పెంచుకొన్న తెంచుకొన్న
మనము చేసుకొనిన విధమె - సృష్టికర్త చేయలేదు.
వాతావరణము రీతిగ సీతాతపభేదములుగ
వర్ణరూపముండవచ్చు - అవయవములు అందరకును
సారూప్యమె సమమె అగును.

పంది నంది కోడికుక్క - గొఱ్ఱె బఱ్ఱె మేక మృగము
మాంసమొకటె మనుజులొకటె - తినుటలోన తేడాలును
మతముబట్టి మారుచుండు - అన్ని ప్రాణులందున్నది
దేవుడైన దేనికింక - కుత్తుకలో కత్తిచెక్కి
జంతువులను చంపుమతము - కొడవలితొ మెడనునరికి
ప్రాణములను బాపుమతము! అన్నిమలములకు మూలము
అహింసయే యగునుకదా! పురుషులకే పరిమితమౌ
మతము మనకు సమ్మతమా! స్త్రీ పురుష శ్రేష్ఠతున్న
మతము మంచిమతమగునా?
సర్వజీవి సమభావన, సర్వమతములయందును
సర్వేశ్వరసందర్శనమున, సమతా మమతా లేనిది
హతముకాని మతము కాదు
మసీదులో మహమ్మదులు మందిరముల హిందువులును
చర్చిలోన క్రైస్తవులును ప్రార్థించిన ఫలితము మొకటె
మహమ్మదు మత ప్రవక్త మానవతా వాది యగును
ఏసుక్రీస్తు ఎవరి పైన ఈసుగలిగి యుండలేదు.
సత్యాహింససమానత, సర్వభూత సమభావన
బోధించెను, బుద్ధుండును, స త్యా హింసల సారమే
గాంధీయును మనకు నేర్పె
ఒకరినొకరు చంపుకొనుట ఒకరి నొకరుదోచుకొనుట మతమా?
అది గతమయ్యెను.

సర్వప్రాణి సమ్మతముగ బ్రతుకుట యేమతమనగా!
వైష్ణవ శ్రీవైష్ణవులని శైవవీరశైవులనుచు
శాక్తేయులు సన్యాసులు స్మార్తులనుచు మధ్వులనుచు
హిందూమత మందమన్నహిందూమహాసముద్రమే!
హీనయాన మహాయాన భేదములతొ బుద్ధమతము.
ఫారసీలు పఠానులు – షేక్‌మగల్ సయ్యదులని
షియాసున్ని ముల్లాలని – ఇస్లాములు ముస్లిములును
రోమనులని లండనులని – సి.యస్.ఐ. ఆర్. సి.యమ్.
ప్రొటిసెంట్లు అసిసెంట్లు క్రైస్తవులును కలరుకదా!
ఏమతమున ఏకత్వము కలదొ చెప్పకలరమీరు?
దేవదూత దైవసూత – పైగంబర దిగంబరులు
ఎందరెందరేమేమో చెప్పినారు చేసినారు
అందుకే నేనంటున్నది – మతమంటే అభిమతమని
ముండన మండనములతో ఖండనభండమునలతో
చండశాసము చేయుచు
దండనములు మెండాయెను, దుండగీంద్రుమెండయ్యిరి.
ఆహారం ఆహార్యము అభ్యాసం ఆచరణం
మానవులకు మార్పుతెచ్చు
అన్నిమతములందున్నది ఐకమత్యమొక్కటియే!
అదిలేనిది యేదిలేదు ప్రజలులేరు ప్రభువులేదు
మతము లేదు పథములేదు
మాతృభూమి, మాతృదేవి, మాతృభాష – మాతృమతము
మహోత్కృష్టమైనట్టివె! అభ్యసించి ఆదరించి

ఆచరించి అర్చించినగొప్పయౌను తప్పుగాదు
పరభూమిని పరమతమును, పరభాషను,
నిరసించిన నేరమగును. – దూషించిన దోషమగును.
స్వీయమతమె శ్రేష్ఠమనుచు గొంతుచించుకొని యరచుచు
మభ్యపెట్టి మతముమార్పు – మతోన్మాదమతమౌఢ్యము
క్రౌర్యమునకు కారణమగు – కలతలకును మూలమగును.
సర్వమతశ్రేష్టమైన సద్గుణముల సంగ్రహించి
అన్నిమతములందునున్న చెడుగుణముల విడనాడుచు
మతిమంతులు – మతసహనము, సహజసిద్ధ సద్గుణములు,
గలిగియుండి మెలగవలెను.
మతమంటే మానవులను సంస్కరించు సాధనమగు
దుష్టులకును దుర్మతులకు మతోన్మాద మతమౌఢ్యము
జన్మతోడ జన్మించును కర్మతోడగలిగించును
ఏదేవుని కొలుచుచున్న ఏమతమును తలచుచున్న
చావుబ్రతుకు సమానమే ఏమతనాయకుడైనను
చావక బ్రతికుండలేదు చచ్చిమరల బ్రతకలేదు
ఏభూమిలో జన్మించిన ఏభాషను భాషించిన
ఏపద్ధతి జీవించిన ఏరీతిగ భూషించిన
ఏవిధమును పాటించిన ఎవరికేమి కానిరీతి
జీవించిన శ్రేయమగును జీవితమేధన్యమగును
మతములోని నడుముతాను చివరచేర్చి చూచితిరా
మమతా, సమతా,నవతా, ఘనతాయగు జనులాంతా!

హి ం దూ మ త ము న  స ర్వ మ త సమానత్వమును నిరూపించు విధము ఇచ్చట గలదనువిషయము ముందు తెలిపితినిగాన హిందూదేశమునకూడ సర్వమత సమానత్వముగలిగి ఐకమత్యముతో జీవించవలెనని ఈ గేయము భావము ప్రస్తుతము మతోన్మాదులుచేయుమారణహోమమును నివారించుటకు దోహదపడగలదని ఈ గేయమునిచ్చట పొందుపరచితి. భైరవేశ్వరుని కాపాడుమని వేడుకొన్న యట్లే  వెంకటేశ్వరుని గూడ వేడుకొను నీగేయమును వ్రాసి భరతవాక్యముతో ముగించెదను.

ఓ వెంకటేశ్వరా ఓ వెంకటారమణ  పల్లవి
ఏడుకొండలపైన ఎత్తైన చోటుండి
ఏమిచేస్తున్నావు ఏమిచూస్తున్నావు
అంతపైనుండియు అట్టడువారల
కష్టనష్టములేల కానలేకున్నావు  ||ఓ||
పైచూపు మానేసి పైనుండి దిగివచ్చి
క్రిందేమి జరుగునో క్రీగంట కనుగొనుము
జోలపాడుచునుండ పూలపానుపు పైన
పట్టెమంచముమీద పవళించి ఉన్నావు
లడ్లూ జిలోబీలు గారెబూరెలు వడలు
పొంగల్లు పులిహోర భోంచేయుచున్నావు
అలివేలిమంగమ్మ అతివనాంచారమ్మ
వింజామరలతోడ వీచుచునుండంగ

తూగుటుయ్యేలలోన ఊగుచునె ఉన్నావు
కస్తూరి నామాలు కనుల కడ్డమురాగ
ఇలలోన జరిగేటి పలుఘోరపాపాలు
కానంగలేవేమొ – కనపడగలేదేమొ
వేదపారాయణ – నాదంబుమోదాన
బీదసాదలమొరలు – వీనులను పడలేద?
బంగారు గుడిలోన – బసచేసియున్నావు
గుడిసెలలో నివసించు – బడుగువారలజాడ
నీకెట్లు కనిపించు చీకట్లోమనుచుండ
పేదలను పీడించి పొదుపు చేసినధనము
మూటెముల్లెలుతెచ్చి ముడుపులని నీకిచ్చి
కాన్కలుగ కాసులను రాసులుగ పోసేటి
దనవంతులను నీవు దరిజేర్చుకుంటావు
దనమిచ్చువారికే దర్శనంబిస్తావు
అధికారులందరిని ఆదరిస్తుంటావు
శేషవస్త్రముతోడ భూషించుచుంటావు
ఏమిధర్మమునీది ఏమినాయముసామి
ఏడుకొండలవాడ ఎక్కడున్నావయ్య
ఏడుకొండలపైన ఎందుకున్నావయ్య

అంబలియుగంజైన అదునుకందకపోయి
పిల్లపాపలతోడ అల్లాడుచున్నట్టి
జనులజాడనీకు కనులలోపడలేద ||ఓ||
ఆహారమందకయే ఆరోగ్యమేలేక
అంతపైనున్ననీ చెంతకేరీతిగ
రాగలరు వారంత రాలేదా? దయకొంత?
దీనులను బ్రోవంగ దిగిరమ్ముగిరినుండి
ధనవంతులిచ్చేటి ధనరాసులన్నింటి
బీదలకు పంచేసి బాధలనుతొలగించు
పాపాత్ములిందరిని పావనులచేయంగ
పుణ్యాత్ములందరను బ్రోవంగరావయ్య
అమ్మవారెపుడైన ఆదమరచినవేల
రాత్రివేళైనను రావయ్య క్రిందికి
ఓ వెంకటేశ్వర ఓ వెంకటారమణ. ||ప||

మంగళం భైరవేశాయ
మహనీయ గుణాత్మనే
సర్వలోక శరణ్యాయ
వేంకటేశాయ మంగళం

ఓం శాంతి శాంతి శాంతిః